# శ్రీ వేంకటేశ్వర వ్రతకల్పము

## సాక్షాత్తూ శ్రీ స్వామివారిచే అనుగ్రహింపబడిన అద్భుత వ్రత కల్పము



విశ్వపతి

శ్రీరస్తు      శుభమస్తు      అవిఘ్నమస్తు

# శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పము

సాక్షాత్తూ శ్రీ స్వామి వారిచే అనుగ్రహింపబడిన అద్భుత వ్రతకల్పము




విశ్వపతి

(తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి)



श्री

శ్రీ డిజైన్స్

VEDIC LOGO DESIGNERS

www.lordofsevenhills.com

Phone : 9849443752

హైదరాబాదు

2021

# శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పము

సాక్షాత్తూ శ్రీ స్వామి వారిచే అనుగ్రహింపబడిన అద్భుత వ్రతకల్పము

తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి



First Edition : 2005
22nd Reprint : January 2021

ఈ పుస్తకం పూర్తి ఉచితం

ఈ పుస్తకం ఎవ్వరు అమ్మరాదు

Printed at :
**VIMAL PRINTERS,**
1-1-776/3/1, SBI Colony,
Gandhi Nagar, Hyderabad.
Cell: 9849160301

తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి రచించిన వ్రత పుస్తకాలు
ఈ వెబ్‌సైట్‌ల నుంచి ప్రింట్ చేసుకొనవచ్చును.

**www.lordofsevenhills.com**

**T.V.R.K. MURTHY,** M.Tech
F-Block, Flat No. 903, Vertex Sadguru Krupa Apartments,
Nizampet Road, HYDERABAD - 500 085, India.
Cell : 98494 43752
Email : viswapathi@yahoo.com, shridesigns@gmail.com

# నివేదన

వేంకటాద్రి సమంస్థానం బ్రహ్మాండే నాస్తికించన
వేంకటేశ సమోదేవో నభూతో నభవిష్యతి

ఈ బ్రహ్మాండములో వేంకటాద్రిని మించిన పవిత్ర ప్రదేశం మరొకటి లేదు. శ్రీ వేంకటేశ్వరునితో సమానమైన దైవం ఇంతకు ముందు లేదు. ఇక తర్వాత ఉండబోదు. సాక్షాత్తు ఆ వైకుంఠ వాసుడైన శ్రీమన్నారాయణుడే మనందరినీ అనుగ్రహించటానికి ఈ కలియుగంలో భూలోకంలో పవిత్ర తిరుమల కొండపై శ్రీనివాసునిగా అవతరించాడు.

ఆ శ్రీనివాసుని లీలలు అద్భుతం, నమ్మిన వారికి కొంగుబంగారం, అనంతుడు, ఆపద మొక్కులవాడు. తరతరాలుగా స్వామి తనను నమ్మిన వారిని రక్షిస్తూ వారికి ముక్తిని ప్రసాదిస్తున్నాడు.

శ్రీ వేంకటేశ వ్రతకల్పం 2005లో వ్రాయడం జరిగింది. ఇదంతా శ్రీ శ్రీనివాసుని అనుగ్రహం తప్ప మరొకటి కాదు. కలియుగమున మనలనందరిని అనేక బాధల నుండి రక్షించడానికి యీ శ్రీ వేంకటేశ్వర వ్రతకల్పమును ఆ స్వామి అనుగ్రహించాడని నా నమ్మకం. 2005 నుండి ప్రతి ఆరు నెలలకు వీలున్నన్ని పుస్తకములు ప్రచురించి ఉచితంగా పంపిణీ చేయడం జరుగుతున్నది. ఇప్పుడు యీ పుస్తకం పదునొకండు భాషలలోనికి అనువదించబడినది. దేశ విదేశాలలోని లక్షలాది భక్తులచే నిత్యం ఆచరింపబడుతున్నది. ఈ పదేళ్ళుగా యీ వ్రతము చేసిన వారి నుంచి వారికి జరిగిన అనేక అద్భుత, సంతోషాలను వివరిస్తూ ఎన్నో ఫోను కాల్సు, ఎన్నో వుత్తరాలు, మరెన్నో 'ఈ-మెయిల్స్ వస్తున్నాయి. ప్రతి శనివారం ప్రపంచవ్యాప్తంగా లక్షలాది మంది భక్తులు యీ కథలను చదువుతున్నారు. అందువలన వారి జీవితము ఎంతో శుభప్రదంగా సుఖసంతోషాలతో గడుస్తున్నదని అంటున్నారు. ఆ శ్రీనివాసుడు ఎంతో దయామూర్తి. తన భక్తులంటే ఆ స్వామికి, అనురాగం, ఆప్యాయత. ఈ రోజున ప్రపంచవ్యాప్తంగా యీ వ్రతం ఇంత విశేష ప్రాచుర్యం పొందిందంటే ఆ స్వామి అనుగ్రహం తప్ప మరొకటి కాదు.

ఆ శ్రీనివాసునికి తన భక్తులంటే అత్యంత ప్రేమ. మనం అహంకారాన్ని, ఈ ఇహలోక విషయాలపై మమకారాన్ని వదిలి ఆ స్వామిని ప్రార్థిస్తే అన్నీ తానే చూసుకుంటాడు.

కలియుగంలో ఇంతకుమించిన దైవం మరొకరు లేరు. ఇందువలననే తిరుమలను రోజూ కొన్ని వేలమంది దర్శిస్తూ, స్వామివారిని సేవిస్తున్నారు.

శ్రీనివాసుని లీలలు అద్భుతం, ఆ స్వామిని మనసారా కొలిస్తే అంతటి మహత్తర దేవుడు మరొకరు మనకు కనబడరు. శ్రీ వేంకట తత్వాన్ని అర్థం చేసుకుంటే అంతకు మించిన బ్రహ్మానందం మరొకటి ఉండదు.

శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పంగా పిలువబడుతున్న ఈ పుస్తకం ఆ స్వామివారి అనుగ్రహంతో రచించడం జరిగింది. ఈ కలియుగంలో మానవులందరూ ఎన్నో బాధలు పడుతున్నారు. ఆ బాధల నుండి బయట పడడానికి ఈ వ్రతం ఒక్కసారి ఆచరిస్తే చాలు. అన్ని బాధలూ తొలగి పోతాయి.

ఈ వ్రతం మొదటి అధ్యాయం పవిత్ర తిరుమల కొండపైన రచించడం జరిగింది. మిగిలిన నాలుగు అధ్యాయాలు మహా మునులైన విశ్వామిత్ర, భరద్వాజ, వశిష్ఠ, అత్రి మహర్షుల అనుగ్రహంతో రచించడం జరిగింది. మహా తపస్సంపన్నులైన వారి అనుగ్రహం కలగడం ఎన్నో జన్మల పుణ్య ఫలంగా భావిస్తున్నాను.

ఈ అధ్యాయాలు వ్రాస్తున్నప్పుడు నాకు కలిగిన అనుభూతులు అద్భుతం. వ్రాస్తున్నంతసేపు ఆ దేవ దేవుని దివ్య చరణాలు ఆ మహామునుల పవిత్ర పాదాలే నా మదిలో స్మరిస్తూ, ప్రార్థిస్తూ రచన సాగించాను.

ఈ వ్రతం ఆచరించడం ఎంతో సులభం. సాక్షాత్తు ఆ శ్రీనివాసుడే అనుగ్రహించి నట్లుగా ఎవరి శక్తి కొలదీ వారు ఈ వ్రతం ఆచరించవచ్చు. ఎంతటి కష్టమైనా ఈ వ్రతమాచరించిన కొన్ని క్షణాలలోనే తొలగిపోగలదు. అయితే ఆచరించేటప్పుడు మాత్రం భక్తి ప్రధానం. ప్రశాంత చిత్తంతో పూర్తి మనస్సునంతా స్వామివారి పాదాలమీదే ఉంచి ఈ వ్రతాన్ని ఆచరిస్తే అద్భుత ఫలితాలు వెంటనే గ్రహించగలుగుతారు.

కలియుగ వాసులైన మనందరి కష్టాలూ, మనకున్న పరిమితులు, వసతులు అన్నీ ఆ శ్రీమన్నారాయుణుడికి తెలుసు. అందుకే ఆ శ్రీనివాసుని ప్రసన్నం చేసుకొనడానికి అత్యంత సులభమైన మార్గాన్ని మనకు ఉపదేశించారు, ఆ స్వామివారు. ఈ వ్రతం ఆచరించిన వారికి, వ్రత కథను విన్నవారికి, ప్రసాదం స్వీకరించిన వారికి ఆ స్వామి అనుగ్రహం తప్పక కలుగుతుంది. వారి వారి కష్టాలన్నీ తొలగిపోతాయి.

భక్తికి ఎటువంటి ఎల్లలూ లేవు. చిన్న భక్తుడు, పెద్ద భక్తుడు అని ఎప్పుడూ ఉండరు. భక్తి ఒక అమృత స్రవంతి. అందరి భక్తికి మూల పురుషుడు ఆ శ్రీమన్నారాయణుడు ఒక్కడే. ఆ శ్రీనివాసుని ఆప్తులైన మీ అందరికీ నా నమస్కారం.

శ్రీనివాసునికి అత్యంత ప్రియమైన ఇంతటి ఈ మహత్తర వ్రత కల్పాన్ని రచించడానికి మించిన మహాభాగ్యం ఏముంటుంది?.. ఇంతకంటే కావలసింది మరేముంటుంది?... ఇంతటి భాగ్యాన్ని ఇచ్చిన ఆ పరబ్రహ్మ మూర్తికి ఇవే నా ప్రణామములు. ఎల్లప్పుడూ ఆ శ్రీవారి సేవలోనే గడుపుతాననీ, శ్రీ వేంకట తత్వాన్ని ప్రజలందరి హృదయాలకు చేరువగా తీసుకువెళ్లడమే నా జీవిత గమ్యం అని ఆ స్వామివారికి విన్నవించు కుంటున్నాను.

ఈ పుస్తక రచనకు ప్రత్యక్షంగాను, పరోక్షంగానూ సహకరించిన ప్రతి ఒక్కరికి ఈ వ్రతకల్పం ఆచరించిన మీకు, వ్రత కథలు విన్నవారికి, ప్రసాదం స్వీకరించినవారికి సకల ఆయురారోగ్య సౌభాగ్యాలు కలగాలని ఆ శ్రీలక్ష్మీ శ్రీనివాసులను ప్రార్థిస్తున్నాను.

సర్వేజనా సుఖినోభవంతు ః
శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్
శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళం

తిమ్మరాజు విశ్వపతి రామ కృష్ణమూర్తి

హైదరాబాద్.
04-01-2016

# వ్రత విధానము

శ్రీ వేంకటేశ్వర వ్రతం రెండు విధాలుగా ఆచరించవచ్చును. మొదటి పద్ధతిలో వివాహం, గృహప్రవేశం, నూతన వ్యాపార ప్రారంభం మొదలైన శుభకార్యాలలో పురోహితునిచేత కలశస్థాపన చేసి విశదంగా ఆచరింపవచ్చును. రెండవ పద్దతిలో శుచిగా స్నానం చేసి ఏ రోజునైనా కేవలం కథలు పఠించినా వ్రతము చేసిన ఫలితం దక్కుతుంది.

**మొదటి పద్ధతి:**

కలియగంలో శ్రీ వేంకటేశ్వర స్వామి వారి అనుగ్రహం పొందడానికి ఈ వ్రతం ఆచరించడం అతి తేలికైన మార్గం. ఈ వ్రతమాచరించిన వెంటనే ఎటువంటి కష్టాలైనా తీరిపోతాయి. సాక్షాత్తూ శ్రీమన్నారాయణునిచే అనుగ్రహింపబడిన ఈ వ్రతం ఆచరించడం అతి సులభం. ఈ వ్రతాన్ని ఎవరైనా, ఎప్పుడైనా ఆచరించవచ్చును. ఆర్థిక బాధలు గాని, ఆరోగ్యబాధలు గాని, మరే ఇతర ఏ కారణాల వలనైనా మనశ్శాంతి లేనప్పుడు ఈ వ్రతం ఆచరించినదే తడవుగా అన్ని కష్టాలూ తీరిపోతాయి. అలాగే మీ ఇంట్లో ఏ శుభ కార్యం తలపెట్టినప్పుడైనా కూడా ఈ వ్రతం చేసుకొనవచ్చును. ఉద్యోగ, వ్యాపారాభివృద్ధి నిమిత్తం కూడా ఈ వ్రతమాచరించి ఎంతో అద్భుత ఫలితాలను వెంటనే పొందగలరు.

ఈ వ్రతాన్ని ముందు చెప్పిన విధంగా ఎప్పుడైనా ఆచరించవచ్చును. ప్రత్యేకించి మార్గశిర, మాఘ, కార్తీక మాసములలో గాని పౌర్ణమి, పంచమి, సప్తమి, ఏకాదశి తిథులయందు గాని, శ్రవణ, స్వాతి నక్షత్ర దినములందు గాని ఆచరించిన మిక్కిలి ఫలదాయకము. ఉదయమున గాని, సాయంత్రమున గాని ఈ వ్రతమాచరించ వచ్చును. ఈ వ్రతము ఐదు అధ్యాయములతో కూడినది. మొదటిది సాక్షాత్తూ శ్రీ వేంకటేశ్వర స్వామివారే అనుగ్రహించగా, మిగిలిన నాలుగు అధ్యాయములకు మహాతపః సంపన్నులైన విశ్వామిత్ర, వశిష్ట భరద్వాజ, అత్రి మహామునులు ప్రవర్తకులై ఉన్నారు. మీ స్వగృహమందుగాని, వసతి గృహమందుగాని, శ్రీ స్వామివారి ఆలయమందుగాని, ఏ పుణ్య క్షేత్రములయందుగానీ, నదీ తీరమున గాని వ్రతమాచరించవచ్చును.

వీలున్నంతవరకూ బంధుమిత్రులందరినీ పిలుచుకొని ఆచరించ వలెను. ముందుగా ఈ వ్రతమును చేసుకొనే ప్రదేశాన్ని శుభ్రం చేసుకోవాలి. తరువాత మంటపమును ఏర్పాటు చేసుకొని అందు శ్రీ వేంకటేశ్వర స్వామివారి పటమును ఉంచుకొనవలెను. శ్రీదేవి, భూదేవిల ఉత్సవ విగ్రహములతో కూడిన కళ్యాణ వేంకటేశ్వర స్వామి వారి పటమును

కూడా ఉంచుకొనిన మిక్కిలి శ్రేష్ఠము. శ్రీ స్వామివారి ప్రతిమని గానీ, రూపాయి బిళ్ళను గానీ ఉంచవలెను. అటు తర్వాత కలశస్థాపన చేసుకొనవలెను.

శ్రీ సత్యనారాయణ స్వామి వారి వ్రతం మాదిరిగా మండపం ఏర్పాటు చేసుకుని, కలశ స్థాపన చేయవలెను. నవగ్రహాలను, అష్టదిక్పాలకులను ఆహ్వానించవలెను. ముందుగా పసుపు వినాయకుని పూజించి వ్రతము నిర్విఘ్నంగా జరుగుటకు ప్రార్థించవలెను. అయిదు అధ్యాయములను చదివి ఈ వ్రతాన్ని అతి భక్తిశ్రద్ధలతో చేసినవారింటికి శ్రీనివాసుడే స్వయంగా బంధువు రూపంలోగాని, అపరిచిత అతిథి రూపంలో గాని, క్రిమి, కీటకాదుల రూపంలో గాని, జంతురూపంలోగాని వచ్చి ప్రసాదాన్ని స్వీకరిస్తానని శ్రీ స్వామివారే సెలవిచ్చారు.

ప్రతి కథ పూర్తవగానే ఒక కొబ్బరికాయ నివేదించవలెను. కథలన్నీ అయిన తరువాత గోధుమరవ్వ, చక్కెర కలిపి చేసిన మహాప్రసాదాన్ని నివేదించాలి. ఇందులో అరటిపండ్ల ముక్కలు వేయవచ్చును. వ్రత కథ అయిన తరువాత గోవిందా, గోవిందా, గోవిందా అని మూడు సార్లు ప్రార్థించవలెను. అన్నప్రాసన, నామకరణం, ఉపనయనం, వివాహం, గృహప్రవేశం, వ్యాపారం వంటి శుభకార్యాలలో యీ మొదటి పద్ధతిలో చేయవలెను.

## రెండవ పద్ధతి:

సాక్షాత్తు శ్రీ స్వామివారే సెలవిచ్చిన మరొక విశేషం ఏమనగా ఒకవేళ మనకు ఎటువంటి కష్టమైనా కలిగినా యింత వివరంగా ఆచరించడానికి కుదిరనప్పుడు తాము యీ పద్ధతిని కూడా ఆచరింపవచ్చును.

మీ యింట్లో సుఖ సంతోషాలు వెల్లివిరియాడానికి, యీ కథలు, ప్రతి శనివారము చదువుకొనవచ్చును. లక్షలాది మంది యీ పద్ధతిలో ప్రస్తుతము ప్రతి శనివారం యీ రెండవ పద్ధతిలో వ్రతము ఆచరిస్తున్నారు.

ఈ పద్ధతి చాలా తేలికయినది. ఈ పద్ధతిలో యీ వ్రతము చేసిన శ్రీనివాసుని అనుగ్రహ ప్రాప్తి వెంటనే కలుగుతుంది. వ్రతము ఆచరించిన రోజున ఉదయము స్నానం చేయగానే పూజ గదిలో స్వామివారి పటం ఎదురుగా కూర్చుని వ్రతము నిర్విఘ్నంగా జరగడానికి శ్రీ విఘ్నేశ్వరుని మనస్సులోనే ప్రార్థించి, మనస్సులో అష్టదిక్పాలకులను, నవగ్రహ దేవతలకు నమస్కరించవలెను. వీలైనచో శ్రీ వేంకటేశ్వర, శ్రీమహాలక్ష్మి, శ్రీపద్మావతి అష్టోత్తరములను చదువుకొనవలెను. తరువాత అయిదు అధ్యాయములు చదవాలి. మీకు

వీలుంటే కథలన్నీ పూర్తవగానే ఒక కొబ్బరికాయను నివేదించండి లేదా ఏదయినా ఫలమును, లేదా తాజాగా వండిన పాయసం వంటి తీపి పదార్థమును నివేదించండి.

ఇవి ఏమి కూడా ఆచరింపలేకపోతే రవ్వంత చక్కెర శ్రీ స్వామివారికి నివేదించినా స్వామి సంతోషిస్తారు. శ్రీనివాసునికి కావలసినది భక్తి మాత్రమే, హంగు, ఆర్భాటం కాదు. ఈ వ్రతము భార్యాభర్తలు యిద్దరూ కలిసి చేసుకునవచ్చును. ఉద్యోగస్థులకు కుదరని ఎడల భార్య, భర్త విడివిడిగా కూడా చేసుకొనవచ్చును. ఈ వ్రతము చేయు రోజున ఉపవాసము చేయవలసిన అవసరము లేదు. అలాగే యీ వ్రతం ఇన్ని వారాలు తప్పక చేయాలన్న నియమం లేదు. మన వీలుని బట్టి ఎన్ని సార్లయినా యీ వ్రతమును చేయవచ్చును.

స్వామి వారికి తులసీ దళమన్న మిక్కిలి ప్రియము. కావున పూజలో తులసీ దళములను నివేదించిన అత్యంత ఫలము కలుగును. వ్రతము పూర్తి అయిన పిదప ఆ తులసీ దళములను అందరూ ప్రసాదముగా తీసుకొన్నచో అన్ని రోగములూ నశించి, అష్టైశ్వర్యములు కలుగును. వ్రత సమాప్తి కాగానే కొబ్బరి కాయను కొట్టి కొబ్బరి ముక్కలు మహా ప్రసాదముతో కలిపి శ్రీవారికి నివేదించి మీరు స్వీకరించి వచ్చినవారందరికి ఇచ్చినచో ఎంతో పుణ్యము లభించును.

ఒక్కటి మనందరం గుర్తుంచుకొనవలెను. మన కష్టములన్నియు విశ్వమంతటిలో ఆ స్వామివారికి తెలిసినట్లుగా మరెవరికీ తెలియవు. కావున ఆ దయామయుని ప్రార్థించి, సంకల్పించి వ్రతమాచరిస్తే తప్పక మనోసిద్ధి నెరవేరగలదు. అన్ని కష్టములూ తొలగిపోయి అష్టైశ్వర్యములు లభించగలవు.

సమస్త సన్మంగళానిభవంతు

శ్రీ లక్ష్మీ శ్రీనివాస కటాక్ష సిద్ధిరస్తు

# శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పము

## శ్రీ గణపతి ధ్యానం

వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ
నిర్విఘ్నం కురుమే దేవ సర్వకార్యేషు సర్వదా
శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే॥
తదేవ లగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ।
విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి॥

## ఆచమనం

| | | |
|---|---|---|
| ఓం కేశవాయ నమః | ఓం శ్రీధరాయ నమః | ఓం పురుషోత్తమాయ నమః |
| నారాయణాయ నమః | ఓం హృషీకేశాయ నమః | ఓం అధోక్షజాయ నమః |
| మాధవాయ నమః | ఓం పద్మనాభాయ నమః | ఓం నారసింహాయ నమః |
| ఓం గోవిందాయనమః | ఓం దామోదరాయ నమః | ఓం అచ్యుతాయ నమః |
| ఓం విష్ణవేనమః | ఓం సంకర్షణాయ నమః | ఓం జనార్దనాయనమః |
| ఓం మధుసూదనాయ నమః | ఓం వాసుదేవాయ నమః | ఓం ఉపేంద్రాయ నమః |
| ఓం త్రివిక్రమాయ నమః | ఓం ప్రద్యుమ్నాయ నమః | ఓం హరయే నమః |
| ఓం వామనాయ నమః | ఓం అనిరుద్ధాయ నమః | ఓం శ్రీ కృష్ణాయనమః |

## భూతోచ్చాటనము

ఉత్తిష్ఠన్తు భూతపిశాచాః ఏతే భూమి భారకాః
ఏతేషామ విరోధేన బ్రహ్మకర్మ సమారభే

(అక్షతలు వెనుకకు వేయవలెను. అనంతరం కుడి చేతితో ముక్కు మూసికొని ప్రాణాయామం చేయవలయును)

## ప్రాణాయామం

ఓం భూః, ఓం భువః, ఓం సువః, ఓం మహః ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యం, ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి, ధియోయోనః ప్రచోదయాత్, ఓం అపోజ్యోతీరసో మృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్.

మమోపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభన ముహూర్తే శ్రీ మహావిష్ణోరాజ్ఞయా ప్రవర్త మానస్య అద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేత వరాహ కల్పే వైవస్వత మన్వనర్తే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరత వర్షే భరత ఖండే మేరోర్దక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య..... (శ్రీశైలానికి వ్రతం చేసేవారి ఊరు ఏ దిక్కులో ఉందో, ఆ దిక్కుని చెప్పాలి) ప్రదేశే, కృష్ణా గోదావరీ మధ్యభాగే (ఏ నదుల మధ్య ప్రాంతంలో వుంటే ఆ నదుల పేర్లు చెప్పవలెను). స్వ / శోభన గృహే, సమస్త దేవతా బ్రాహ్మణ, హరిహర గురుచరణ సన్నిధౌ, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన స్వస్తిశ్రీ ప్రభవాది నామ సంవత్సర మధ్య (ప్రస్తుతం జరుగుతున్న సంవత్సరం ఆయనం, ఋతువు, మాసం, పక్షం తిథి వారములను క్రమంగా చేర్చి చెప్పుకోవలెను) సంవత్సరే ఆయనే.. ఋతౌ, మాసే.... పక్షే.. తిథౌ వాసరే, శుభ నక్షత్రే, శుభయోగే, శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్.. గోత్రః.... నామధేయః ధర్మపత్నీ సమేతస్య అస్మాకం సహకుటుంబానాం క్షేమ స్థైర్య ధైర్య విజయ ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం, ధర్మార్థ కామమోక్ష చతుర్విధ పురుషార్థ ఫల సిద్ధ్యర్థం మమోపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర దేవతా ముద్దిశ్య శ్రీ వేంకటేశ్వర వ్రతకల్ప కరిష్యే ద్రవ్యైః సమ్భవద్భిః పదార్థై సమ్భవతా నియమేన యావచ్ఛక్తి ధ్యానా వాహనాది షోడశోపచార పూజాం కరిష్యే

(నీటిని స్పృశించాలి)

## తదంగ కలశారాధనం కరిష్యే

(ఉదకమును వదలవలయును. సంకల్పమునకూ, ఆచనమునకూ వాడు పాత్రను కలశారాధనముకు వాడరాదు. స్వామికి కుడివైపున కలశము నుంచి దానికి గంధం, కుంకుమ, అక్షతలూ మూడు ఉంచి కలశంలో పువ్వు వైచి క్రింది శ్లోకాన్ని చెప్పవలయును)

## కలశారాధనం

కలశస్యముఖే విష్ణుః కంఠేరుద్రస్సమాశ్రితః
మూలే తత్ర స్థితో బ్రహ్మ మధ్యేమాతృగణాశ్రితాః
కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా
ఋగ్వేదో థ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః
అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః
కలశే గంధ పుష్పాక్షతాన్ నిక్షిప్త్య, హస్తేనాచ్ఛాద్య,

ఆపో వా ఇదగ్ం సర్వం విశ్వాభూతాన్యాపః ప్రాణవా ఆపః పశవ ఆపోన్న మాపోమృత మాప స్సమ్రాడాపో విరాడాప స్వరాడాపశ్ఛందాగ్ంస్యాపో జ్యోతీగ్ం ష్యాపో యజూగ్ంష్యాప స్సత్యమాప స్సర్వా దేవతా అపోభూర్భువస్సువ రాప ఓమ్.

*(కలశాన్ని ఉదకంతో నింపి అందులో తులసీ దళాన్ని వేయవలయును)*

గంగే చ యమునేచైవ గోదావరి సరస్వతీ।
నర్మదే బంధు కావేరీ జలే స్మిన్ సన్నిధింకురు
కావేరీ తుంగ భద్రాచ కృష్ణవేణీచ గౌతమీ
భాగీరథీచ విఖ్యాతా పంచగంగా ప్రకీర్తితాః
కలశోదకేన దేవమాత్మానం పూజాద్రవ్యాణి చ సంప్రోక్ష్య.

*(కలశమునందలి ఉదకాన్ని పువ్వుతో స్వామి పైననూ, పూజాద్రవ్యాలపైనా తమ పైననూ చల్లుకోవాలి)*

## శ్రీ గణపతి ప్రార్థన

శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే॥
అదౌ నిర్విఘ్నేన వ్రత పరిసమాప్త్యర్థం గణపతి పూజాం కరిష్యే.

## అథగణపతి పూజా

గణానాం త్వాంగణపతిగ్ం హవామహే
కవిం కవీనా ముపమశ్రవస్తమం.

జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆనశ్శృణ్య న్నూతిభి స్సీదసాధనమ్.
*శ్రీ మహాగణాధిపతయే నమః, ధ్యాయామి, ధ్యానం సమర్పయామి. ఆవాహయామి, రత్న సింహాసనం సమర్పయామి, పాదయోః పాద్యం సమర్పయామి, హస్తయో ర్ఘ్యం సమర్పయామి, ముఖే ఆచమనీయం సమర్పయామి.*

ఆపోహి ష్ఠామయోభువస్తాన ఊర్జేదధాతన, మహేరణాయ చక్షసే,
యో వశ్శివత మోరసస్తస్య భాజయతేహనః ఉశతీరిన మాతరః
తస్మాఅరం గమామవో యస్యక్షయాయ జిన్వథ, అపోజనయథాచనః
*శ్రీ మహాగణాధిపతయే నమః శుద్ధోదక స్నానం సమర్పయామి.*
*స్నానాంతరం శుద్ధా చమనీయం సమర్పయామి.*

అభివస్త్రాసు వసనాన్యర్ షాభిదేనూస్సు దుఘాః పూజమానః
అభిచంద్రా భర్త వే నో హిరణ్యాభ్యశ్వాన్‌రథినోదేవ సోమ
*శ్రీ మహాగణాధిపతయేనమః, వస్త్రయుగ్మం సమర్పయామి.*

యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతే ర్యత్సహజం పురస్తాత్,
ఆయుష్య మగ్ర్యం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః
*శ్రీ మహాగణాధిపతయేనమః, యజ్ఞోపవీతం సమర్పయామి.*

గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం,
ఈశ్వరీగ్ం సర్వభూతానాం తా మిహోపహ్వయే శ్రియమ్,
*శ్రీ మహాగణాధిపతయేనమః, దివ్యశ్రీ చందనం సమర్పయామి.*

ఆయనే తే పరాయణే దుర్వా రోహంతు పుష్పిణీః
హ్రదాశ్చ పుండరీకాణి సముద్రస్య గృహా ఇమే.
*శ్రీ మహాగణాధిపతయేనమః, దూర్వాది నానా విధ పుష్పాణి పూజయామి.*

## అథశ్రీ షోడశనామ పూజా

ఓం సుముఖాయ నమః
ఓం ఏకదంతాయ నమః
ఓం కపిలాయ నమః
ఓం గజకర్ణికాయ నమః
ఓం లంబోదరాయ నమః
ఓం వికటాయ నమః
ఓం విఘ్నరాజాయ నమః
ఓం గణాధిపతయే నమః
ఓం ధూమకేతవే నమః
ఓం గణాధ్యక్షాయ నమః
ఓం ఫాలచంద్రాయ నమః
ఓం గజాననాయ నమః
ఓం వక్రతుండాయ నమః
ఓం శూర్పకర్ణాయ నమః
ఓం హేరంబాయ నమః
ఓం స్కంద పూర్వజాయ నమః
ఓం సర్వసిద్ధి ప్రదాయకాయ నమః
ఓం శ్రీమహాగణాధిపతయే నమః

## నానావిధ పరిమళ పుష్పాణి సమర్పయామి

వనస్పత్యుర్భవైర్దివ్యై నానా గంధైస్సు సంయుతః
ఆఘ్రేయ స్సర్వదేవానాం ధూపోయం ప్రతిగృహ్యతాం
శ్రీ మహాగణాధిపతయే నమః, ధూపమాఘ్రాపయామి
సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినా యోజితం ప్రియం,
గృహాణ మంగళం దీపం త్రైలోక్యతిమిరావహం,
భక్త్యా దీపం ప్రయచ్ఛామి దేవాయ పరమాత్మనే,
త్రాహి మాం నరకాద్ఘోరా ద్దివ్యజ్యోతి ర్నమోస్తుతే
*శ్రీ మహాగణాధిపతయేనమః, దీపం సమర్పయామి, ధూపదీపా నంతరం ఆచమనీయం సమర్పయామి.*

నైవేద్యం : చిన్న బెల్లపు ముక్క ఉంచి దాని చుట్టూ నీళ్ళు చల్లి సంప్రోక్షించుచూ ఓం భూర్భువస్సువః తత్ సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి, ధియోయోనః ప్రచోదయాత్.

సత్యం త్వర్తేన పరిషించామి (ఋతం త్వా సత్యేన పరిషించామి అని రాత్రి చెప్పవలెను).

శ్రీ మహాగణాధిపతయేనమః, గుడోపహారనైవేద్యం సమర్పయామి
అమృతమస్తు అమృతోపస్తరణమసి

*ఓం ప్రాణాయస్వాహా ఓం అపానాయస్వాహా ఓం వ్యానాయస్వాహా ఓం ఉదానాయస్వాహా, ఓం సమానాయస్వాహా, మధ్యే మధ్యే పానీయం సమర్పయామి.*

అమృతాపిథాన మసి ఉత్తరాపోశనం సమర్పయామి.
హస్తౌ ప్రక్షాళయామి, శుద్ధాచమనీయం సమర్పయామి.
పూగీఫలై స్సకర్పూరై ర్నాగవల్లీదళైర్యుతం,
ముక్తా చూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం
తాంబూలం సమర్పయామి.

*గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముపమశ్రవస్తవం. జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత అనశ్శృణ్వ న్నూతిభి స్సీద సాదనం శ్రీ మహాగణాధిపతయే నమః, సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి.*

మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం గణాధిప,
యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తుతే.

*యజ్ఞేన యజ్ఞమయ జంత దేవా స్తాని ధర్మాణి ప్రథమా న్యాసన్ తేహనాకం మహిమాన స్సచంతే యత్ర పూర్వేసాధ్యా స్సంతిదేవాః*
*పునరాచమనం.*

*అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా చ భగవాన్ సర్వాత్మకః శ్రీ మహాగణాధిపతి స్సుప్రీతో వరదో భూత్వా ఉత్తరే కర్మణ్య విఘ్నమస్త్వితి భవంతో బృవంతు ఉత్తరే కర్మణ్య విఘ్నమస్తు గణాధిపతి ప్రసాదం శిరసా గృహ్ణామి.*

సహస్రపరమా దేవీ శతమూలా శతాంకురా,
సర్వగ్ం హరతు మే పాపం దూర్వాదుస్స్వప్న నాశనీ,
గణపతిం యధాస్థానము ద్వాసయామి,

## ప్రాణ ప్రతిష్ఠ

ఓం అసునీతే పునరస్మాసు చక్షుః పునః
ప్రాణమిహనోదేహి భోగం జ్యోక్పశ్యేమ
సూర్యముచ్చరన్త మనుమతే మృడయాన స్వస్తి
అమృతం వైప్రాణా అమృతమాపః ప్రాణానేవ

యధాస్థానముపహ్వాయతే

(ప్రతిమను స్పృశించాలి)

శ్రీ వేంకటేశ్వర స్వామి ఆవాహయామి, స్థాపయామి, పూజయామి

స్థిరోభవ, వరదోభవ సుప్రసన్నో భవ, స్థిరాసనం కురు.

## ధ్యానం

శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం

విశ్వాకారం గగన సదృశం మేఘ వర్ణం శుభాఙ్గమ్

లక్ష్మీ కాంతం కమలనయనం యోగిహృధ్యాన గమ్యమ్

వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథం

శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమ:

ధ్యాయామి, ధ్యానం సమర్పయామి *(పుష్పాన్నైనా పత్రాన్నైనా ఉంచవలెను)*

## ఆవాహనం

ఆవాహయామి దేవేశ సిద్ధగన్ధర్వ సేవిత

యద్రహస్యమిదం పుణ్యం సర్వపాపహరోహరః

శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమ:

ఆవాహయామి *(పుష్పాన్నైనా పత్రాన్నైనా ఉంచవలెను)*

## ఆసనం

దేవ దేవ జగన్నాథ ప్రణుత క్లేశనాశన

రత్న సింహాసనం దివ్యం గృహాణ మధుసూదన

శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమ:

*రత్నసింహాసనం సమర్పయామి (పుష్పపత్రాలలో దేన్నైనా ఉంచవలెను)*

## పాద్యం

వాంచితం కురుమే దేవ దుష్కృతం చ వినాశయ

పాద్యం గృహాణ భగవాన్ మాతురుత్సఙ్గ సంస్థిత

శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమః

*పాదయో, పాద్యం సమర్పయామి (నీటిని పళ్ళెంలో విడువవలయును)*

## అర్ఘ్యం

కురుష్వమే దయాం దేవ సంసారార్తి భయాపహ
దధిక్షీర ఫలోపేతం గృహాణార్ఘ్యం నమోస్తుతే
శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమః
*హస్తయోరర్ఘ్యం సమర్పయామి (ఉదకాన్ని పళ్ళెంలో విడువవలయును)*

## ఆచమనం

నమ స్సత్యాయ శుద్ధాయ నిత్యాయ జ్ఞానరూపిణే
గృహాణాచమనం దేవ సర్వలోకైక నాయక
శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమః
*ముఖే ఆచమనీయం సమర్పయామి.*
*(నీటిని పళ్ళెంలో విడువవలయును)*

## పంచామృతస్నానం

పంచామృతం మయానీతం పయోదధిఘృతం మధు
శర్కరా సహితం చైవదేవత్వం ప్రతిగృహ్యాతాం
శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమః
పంచామృత స్నానం సమర్పయామి
*(పంచామృతములనగా ఆవుపాలు, పెరుగు, నెయ్యి, తేనె పంచదార నీరు కలిసినవి వీటితో స్వామిని అభిషేకించాలి)*

## స్నానం

స్వర్ణపాత్రోదకం గంగా యమునాది సమన్వితం
శుద్ధోదకం గృహాణేశ స్నానం కురు యధావిధి
శ్రీ లక్ష్మీ పద్మావతీసమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమః శుద్ధోదక స్నానం సమర్పయామి *(ఉదకమును విడువవలయును)*

## వస్త్రం

తప్తకాంచన సంకాశం పీతాంబర మిదం హరే
సుగృహాణ జగన్నాథ శ్రీనివాస నమోస్తుతే
*శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమః వస్త్రయుగ్మం సమర్పయామి (వస్త్రయుగ్మం సమర్పించనిచో ప్రత్తినే కొద్ది పొడవుగా చేసి పసుపు కుంకుమ లంటించి సమర్పించవచ్చు.*

## యజ్ఞోపవీతం

యజ్ఞోపవీతం పరమం పవిత్రం
ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్
ఆయుష్యమగ్ర్యం ప్రతిముఞ్చశుభ్రం
యజ్ఞోపవీతం బలమస్తు తేజః
శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమః
*యజ్ఞోపవీతం సమర్పయామి (ప్రత్తి నుంచి పోగు లాగి పసుపు కుంకుమ లంటించి అటువంటివి రెండింటిని సమర్పించవలయును. యజ్ఞోపవీతార్థం పుష్పం అని పువ్వు వెయ్యవచ్చును.)*

## గంధం

చందనాగరు కస్తూరీ ఘనసార సమన్వితం
గంధం గృహాణ గోవింద నానాగంధాంశ్చధారయ
*శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమః దివ్య పరిమళ గన్ధాన్ సమర్పయామి (చందనమును సమర్పించవలయును)*

## అక్షతలు

గోవిందా పరమానంద హరిద్రా సహితాక్షతాన్
విశ్వేశ్వర విశాలాక్ష గృహాణ పరమేశ్వర
*శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమః అక్షతాన్ సమర్పయామి (అక్షతలు వేయవలెను)*

## పుష్పం

సుగంధీని సుపుష్పాణి జాజీకుందముఖానిచ।
మాలతీ వకుళాదీని పూజార్థం ప్రతిగృహ్యతామ్।
శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమః
పుష్పం సమర్పయామి (పుష్పములు వేయవలెను)

## అథాంగ పూజ

ఓం శ్రీ వేంకటేశ్వరాయ నమః – పాదౌ పూజయామి
ఓం శ్రీ వేంకటాచలాధీశాయ నమః – గుల్ఫౌ పూజయామి
ఓం శ్రీ ప్రదాయకాయ నమః – జానునీ పూజయామి
ఓం పద్మావతీ పతయే నమః – జంఘే పూజయామి
ఓం జ్ఞానప్రదాయ నమః – ఊరుం పూజయామి
ఓం శ్రీనివాసాయ నమః – కటిం పూజయామి
ఓం మహాభాగాయ నమః – నాభిం పూజయామి
ఓం నిర్మలాయ నమః – ఉదరం పూజయామి
ఓం విశాల హృదయాయ నమః – హృదయం పూజయామి
ఓం పరిశుద్ధాత్మనే నమః – స్తనౌ పూజయామి
ఓం పురుషోత్తమాయ నమః – భుజౌ పూజయామి
ఓం స్వర్ణ హస్తాయ నమః – హస్తౌ పూజయామి
ఓం వరప్రదాయ నమః – కంఠం పూజయామి
ఓం లోకనాథాయ నమః – స్కంధౌ పూజయామి
ఓం సర్వేశ్వరాయ నమః – ముఖం పూజయామి
ఓం రసజ్ఞాయ నమః – నాసికాం పూజయామి
ఓం పుణ్య శ్రవణ కీర్తనాయ నమః – శ్రోత్రే పూజయామి
ఓం పుల్లాంబుజ విలోచనాయ నమః – నేత్రే పూజయామి
ఓం వర్చస్వినే నమః – లలాటం పూజయామి
ఓం రమ్య విగ్రహాయ నమః – సర్వాణ్యంగాని పూజయామి
ఓం శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర పరమాత్మనే నమః
దివ్యసుందర విగ్రహం పూజయామి

# శ్రీ వేంకటేశ్వర అష్టోత్తర శతనామావళి

ప్రతి నామమునకు ముందు 'ఓం' అనియు చివర 'నమః' అనియు పూజించవలెను.

వేంకటేశాయ
శ్రీనివాసాయ
లక్ష్మీపతయే
అనామయాయ
అమృతాంశాయ
జగద్వంద్యాయ
గోవిందాయ
శాశ్వతాయ
ప్రభవే
శేషాద్రినిలయాయ
దేవాయ
కేశవాయ
మధుసూదనాయ
అమృతాయ
మాధవాయ
కృష్ణాయ
శ్రీహరయే
జ్ఞానపంజరాయ
శ్రీవత్సవక్షసే
సర్వేశాయ
గోపాలాయ
పురుషోత్తమాయ
గోపీశ్వరాయ
పరంజ్యోతిషే
వైకుంఠపతయే
అవ్యయాయ
సుధాతనవే
యాదవేంద్రాయ
నిత్యయౌవనరూపవతే
చతుర్వేదాత్మకాయ
విష్ణవే
అచ్యుతాయ
పద్మినీప్రియాయ
ధరాపతయే
సురపతయే
నిర్మలాయ
దేవపూజితాయ
చతుర్భుజాయ
చక్రధరాయ
త్రిధామ్నే
త్రిగుణాశ్రయాయ
నిర్వికల్పాయ
నిష్కళంకాయ
నిరాంతకాయ
నిరంజనాయ
నిరాభాసాయ
నిత్యతృప్తాయ
నిర్గుణాయ
నిరుపద్రవాయ
గదాధరాయ
శారంగపాణయే
నందకినే
శంఖధారకాయ
అనేకమూర్తయే
అవ్యక్తాయ
కటిహస్తాయ
వరప్రదాయ
అనేకాత్మనే
దీనబంధవే
ఆర్తలోకాభయప్రదాయ
ఆకాశరాజవరదాయ
యోగిహృత్పద్మమందిరాయ
దామోదరాయ
కరుణాకరాయ
జగత్పాలాయ
పాపఘ్నాయ
భక్తవత్సలాయ
త్రివిక్రమాయ
శింశుమారాయ
జటామకుటశోభితాయ
శంఖమధ్యోల్లసన్మంజులాయ
కింకి ణ్యాఢ్య కరండకాయ
నీలమేఘశ్యామతనవే
బిల్వపత్రార్చనప్రియాయ
జగద్వ్యాపినే
జగత్కర్త్రే
జగత్సాక్షిణే
జగత్పతయే
చింతితార్థప్రదాయ
జిష్ణవే
దాశార్హాయ
దశరూపవతే
దేవకీనందనాయ
శౌరయే
హయగ్రీవాయ
జనార్ధనాయ
కన్యాశ్రవణతారేజ్యాయ
పీతాంబరధరాయ
అనఘాయ
వనమాలినే
పద్మనాభాయ
మృగయాసక్తమానసాయ
అశ్వారూఢాయ
ఖడ్గధారిణే
ధనార్జనసముత్సుకాయ
ఘనసారలసన్మధ్య కస్తూరీ తిలకోజ్జ్వలాయ
సచ్చిదానందరూపాయ
జగన్మంగళదాయకాయ
యజ్ఞరూపాయ
యజ్ఞభోక్త్రే
చిన్మయాయ
పరమేశ్వరాయ
పరమార్థప్రదాయ
శాంతాయ
శ్రీమతే
దోర్దండవిక్రమాయ
పరాత్పరాయ
పరబ్రహ్మణే
శ్రీ విభవే
జగదీశ్వరాయ

# శ్రీ మహాలక్ష్మీ అష్టోత్తర శతనామావళి

ప్రతి నామమునకు ముందు 'ఓం' అనియు చివర 'నమః' అనియు పూజించవలెను.

ప్రకృత్యై
వికృత్యై
విద్యాయై
సర్వభూతహితప్రదాయై
శ్రద్ధాయై
విభూత్యై
సురభ్యై
పరమాత్మికాయై
వాచ్యై
పద్మాలయాయై
పద్మాయై
శుచ్యై
స్వాహాయై
స్వధాయై
సుధాయై
ధన్యాయై
హిరణ్మయై
లక్ష్మ్యై
నిత్యపుష్టాయై
విభావర్యై
ఆదిత్యై
దిత్యై
దీప్తాయై
వసుధాయై
వసుధారిణ్యై
కమలాయై
కాంతాయై
కామాక్ష్యై
క్రోధసంభవాయై
అనుగ్రహప్రదాయై
బుద్ధ్యై
అనఘాయై
హరివల్లభాయ
అశోకాయై
అమృతాయై
దీప్తాయై
లోకశోక వినాశిన్యై
ధర్మనిలయాయై
కరుణాయై
లోకమాత్రే
పద్మప్రియాయై
పద్మహస్తాయై
పద్మాక్ష్యై
పద్మసుందర్యై
పద్మోద్భవాయై
పద్మముఖ్యై
పద్మనాభప్రియాయై
రమాయై
పద్మమాలాధరాయై
దేవ్యై
పద్మిన్యై
పద్మగంధిన్యై
పుణ్యగంధాయై
సుప్రసన్నాయై
ప్రసాదాభిముఖ్యై
ప్రభాయై
చంద్రవదనాయై
చంద్రాయై
చంద్రసహోదర్యై
చతుర్భుజాయ
చంద్రరూపాయ
ఇందిరాయై
ఇందు శీతలాయై
ఆహ్లాదజనన్యై
పుష్ట్యై
శివాయై
శివకర్యై
సత్యై
విమలాయై
విశ్వజనన్యై
తుష్ట్యై
దారిద్ర్య నాశిన్యై
ప్రీతిపుష్కరిణ్యై
శాంతాయై
శుక్లమాల్యాంబరాయై
శ్రియై
భాస్కర్యై
బిల్వనిలయాయై
వరారోహాయై
యశస్విన్యై
వసుంధరాయై
ఉదారాంగాయై
హరిణ్యై
హేమమాలిన్యై
ధనధాన్యకర్యై
సిద్ధ్యై
స్త్రైణ సౌమ్యాయై
శుభప్రదాయై
నృపవేశ్మగతానందాయై
వరలక్ష్మ్యై
వసుప్రదాయై
శుభాయై
హిరణ్యప్రాకారాయై
సముద్రతనయాయై
జయాయై
మంగళదేవ్యై
విష్ణువక్షస్థలస్థితాయై
విష్ణు పత్న్యై
ప్రసన్నాక్ష్యై
నారాయణసమాశ్రితాయై
దారిద్ర్యధ్వంసిన్యై
దేవ్యై
సర్వోపద్రవవారిణ్యై
నవదుర్గాయై
మహాకాళ్యై
బ్రహ్మవిష్ణుశివాత్మికాయై
త్రికాలజ్ఞాన సంపన్నాయై
భువనేశ్వర్యై

# శ్రీ పద్మావతీ అష్టోత్తర శతనామావళి

**ప్రతి నామమునకు ముందు 'ఓం' అనియు చివర 'నమః' అనియు పూజించవలెను.**

పద్మావత్యై
దేవ్యై
పద్మోద్భవాయై
కరుణప్రదాయిన్యై
సహృదయాయై
తేజస్వరూపిణ్యై
కమలముఖై
పద్మధరాయ
శ్రియై
పద్మనేత్రే
పద్మకరాయే
సుగుణాయై
కుంకుమప్రియాయై
హేమవర్ణాయై
చంద్రవందితాయై
ధగధగప్రకాశ శరీరధారిణై
విష్ణుప్రియాయై
నిత్యకల్యాణ్యై
కోటి సూర్యప్రకాశిన్యై
మహా సౌందర్యరూపిణ్యై
భక్తవత్సలాయై
బ్రహ్మాండవాసిన్యై
సర్వవాంచాఫలదాయిన్యై
ధర్మసంకల్పాయై
దాక్షిణ్యకటాక్షిణ్యై
భక్తిప్రదాయిన్యై
గుణత్రయవివర్జితాయై
కళాషోడశసంయుతాయై
సర్వలోకానాంజనన్యై
ముక్తిదాయిన్యై
దయామృతాయాయై
ప్రాజ్ఞాయై
మహాధర్మాయై
ధర్మరూపిణ్యై
అలంకార ప్రియాయై
సర్వదారిద్ర్యధ్వసిన్యై
శ్రీ వేంకటేశవక్షస్థలస్థితాయై
లోకశోకవినాశిన్యై
వైష్ణవ్యై
తిరుచానూరుపురవాసిన్యై
వేదవేద్యవిశారదాయై
విష్ణుపాద సేవితాయై
రత్న ప్రకాశకిరీటధారిణ్యై
జగన్మోహిన్యై
శక్తి స్వరూపిణ్యై
ప్రసన్నోదయాయై
ఇంద్రాదిదైవత యక్షకిన్నెర
కింపురుష పూజితాయై
సర్వలోకనివాసిన్యై
భూజయాయై
ఐశ్వర్యప్రదాయిన్యై
శాంతాయై
ఉన్నతస్థానస్థితాయై
మందారకామిన్యై
కమలాకరాయై
వేదాంతజ్ఞానరూపిణ్యై
సర్వసంపత్తిరూపిణ్యై
కోటిసూర్యసమప్రభాయై
పూజఫలదాయిన్యై
కమలాసనాది సర్వదేవతాయై
వైకుంఠవాసిన్యై
అభయదాయిన్యై
ద్రాక్షాఫలపాయసప్రియాయై
నృత్యగీతప్రియాయై
క్షీరసాగరోద్భవాయై
ఆకాశరాజ పుత్రికాయై
సువర్ణహస్తధారిణ్యై
కామరూపిణ్యై
కరుణాకటాక్షధారిణ్యై
అమృతాసుజాయై
భూలోకస్వర్గసుఖదాయిన్యై
అష్టదిక్పాలకాధిపత్యై
మన్మధదర్ప సంహార్యై
కమలార్ధభాగాయై
స్వల్పపరాధ
మహాపరాధక్షమాయై
షట్కోటితీర్ధ వాసితాయై
నారదాది మునిశ్రేష్ఠ
పూజితాయై
ఆదిశంకరపూజితాయై
ప్రీతిదాయిన్యై
సౌభాగ్యప్రదాయిన్యై
మహాకీర్తి ప్రదాయిన్యై
కృష్ణాతిప్రియాయై
గంధర్వ శాపవిమోచకాయై
కృష్ణపత్న్యై
త్రిలోకపూజితాయై
జగన్మోహిన్యై
సులభాయై
సుశీలాయై
అంజనాసుతానుగ్రహ
ప్రదాయిన్యై
భక్త్యాత్మ నివాసిన్యై
సంధ్యావందిన్యై
సర్వలోకమాత్రే
ఓం అభిమతదాయిన్యై
లలితావధూత్యై
సమస్తశాస్త్ర విశారదాయై
సువర్ణాభరణధారిణ్యై
ఇహపరలోక సుఖ ప్రదాయిన్యై
కరవీరనివాసిన్యై
నాగలోకమణిసహా ఆకాశసింధు
కమలేశ్వర పూరితరధగ
మనాయై
శ్రీశ్రీనివాస ప్రియాయై
చంద్రమండలస్థితాయై
అలివేలు మంగాయై
దివ్యమంగళ ధారిణ్యై
సుకళ్యాణపీఠస్థితాయై
కామకవన పుష్పప్రియాయై
కోటి మన్మధరూపిణ్యై
భానుమండలరూపిణ్యై
పద్మపాదాయై
రమాయయా
సర్వలోకసభాంతర ధారిణ్యై
సర్వమానసవాసిన్యై
సర్వాయై
విశ్వరూపాయై
దివ్యజ్ఞానాయై
స్వమంగళరూపిణ్యై
సర్వానుగ్రహప్రదాయిన్యై
ఓంకారస్వరూపిణ్యై
బ్రహ్మజ్ఞానసంభూతాయై
శ్రీ పద్మవత్యై
సద్యోవేదవత్యై
శ్రీ మహాలక్ష్మ్యై

## ధూపం

దశాంగం గుగ్గులోపేతం గోఘృతేన సమన్వితం
ధూపం గృహాణ దేవేశ సర్వలోక నమస్కరా।
శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమః
ధూపమాఘ్రాపయామి (ధూపమును సమర్పించవలెను)

## దీపం

। త్రిలోకేశ మహాదేవ సర్వజ్ఞాన ప్రదాయక ।
దీపం దాస్యామి దేవేశ రక్షమాం భక్తవత్సల ।
శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమః దీపం దర్శయామి (దీపాన్ని చూపవలెను).

## నైవేద్యం

సర్వభక్ష్యైశ్చ భోజ్యైశ్చ రసైష్షడ్భి స్సమన్వితం ।
నైవేద్యంతు మయానీతం గృహాణ పురుషోత్తమ।

శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమః నైవేద్యం సమర్పయామి (నైవేద్యమును సమర్పించాలి. అరటిపండ్లయితే కదళీఫలం కొబ్బరి నారికేళ ఫలం నివేదయామి అనియు బెల్లం ముక్క అయితే గుడోపహార నైవేద్యం సమర్పయామి అని చెప్పవలెను)

ఓం ప్రాణాయస్వాహా, ఓం అపానాయస్వాహా, ఓం వ్యానాయ స్వాహా, ఓమ్ ఉదానాయస్వాహా, ఓం సమానాయస్వాహా, ఓం పరబ్రహ్మణే స్వాహా (ఉదకమును ప్రోక్షిస్తూ) ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్, ఓమాపో జ్యోతీరాపో మృతం బ్రహ్మ భూర్భువస్సువరోం (స్వామికి చేతితో చూపవలెను)

మధ్యే మధ్యే పానీయం సమర్పయామి

(ఉదకమును విడిచి పెట్టవలయును)

అమృతాపిధానమసి, ఉత్తరాపోశనం సమర్పయామి, హస్తౌ ప్రక్షాళ యామి, పాదౌ ప్రక్షాళయామి, పునరాచమనీయం సమర్పయామి.

## తాంబూలం

పూగీఫలై స్సకర్పూరై ర్నాగవల్లీదళైర్యుతం,
ముక్తా చూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం
తాంబూలం సమర్పయామి.

## నీరాజనం

శ్రియః కాన్తాయ కళ్యాణ నిధయే నిధయేర్థినాం
శ్రీ వేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళం.
శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమః
నీరాజనం దర్శయామి (నీరాజనం సమర్పించి ఉద్ధరిణితో ఉదకాన్ని తీసుకొని)
నీరాజననాంతరం పునరాచమనీయం సమర్పయామి
(అని ఉదకాన్ని వీడవలయును)

## మంత్రపుష్పం

ఓం సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువం,
విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్.
విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిం.
విశ్వమేవేదం పురుషస్తద్విశ్వముపజీవతి,
పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్.
నారాయణ పరోజ్యోతి రాత్మానారాయణః పరః
నారాయణపరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః
నారాయణ పరో ధ్యాతా ధ్యానం నారాయణః పరః
యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతే పివా.
అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః,

అనంతమవ్యయం కవిగ్ం సముద్రేంతం విశ్వశంభువం
పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖం.
అధోనిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యాముపరి తిష్ఠతి.
జ్వాలమాలాకులంభాతీ విశ్వస్యాయతనం మహత్.
సంతతగ్ం శిలాభిస్తులంబత్యా కోశసన్నిభమ్.
తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్త్సర్వం ప్రతిష్ఠితమ్.
తస్యమధ్యే మహానగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః,
సోగ్రభు గ్విభజన్తిష్ఠ న్నాహార మజరః కవిః,
తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయ స్తస్య సంతతా,
సంతాపయతి స్వందేహ మాపాదతలమస్తకః,
తస్యమధ్యే వహ్ని శిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః
నీలతో యద మధ్యస్తా ద్విద్యుల్లేఖేవ భాస్వరా,
నీవారశూకవత్తన్వీ పీతాభా స్త్యణూపమా,
తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః,
సబ్రహ్మా సశివ, స్సహరి స్సేంద్ర స్సోక్షరః పరమస్వరాట్
ఋతగ్ం సత్యంపరం బ్రహ్మా పురుషం కృష్ణ పింగళం
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వ రూపాయ వై నమో నమః
ఓం నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి తన్నో విష్ణు ప్రచోదయాత్
రాజాధిరాజాయ ప్రసహ్య సాహినే. నమోవయంవై శ్రవణాయ కుర్మహే
నమేకా మాన్కామకామాయ మహ్యం కామేశ్వరో వై శ్రవణో దదాతు,
కుబేరాయ వై శ్రవణాయ మహారాజాయ నమః

ఓం తద్బ్రహ్మా, ఓం తద్వాయు, ఓం తదాత్మా,
ఓం తత్సత్యం, ఓం తత్సర్వం, ఓం తత్పురోం నమః
అంతశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు,
త్వం యజ్ఞ స్త్వం వషట్కారస్త్వగం మిన్ద్రస్త్వం రుద్రస్త్వం
విష్ణుస్త్వం బ్రహ్మాస్త్వం ప్రజాపతిః.

త్వం తదాప అపోజ్యోతీ రసో మృతం బ్రహ్మ
భూర్భువ స్సువరోమ్.
గదా పునశ్శఙ్ఖరథాఙ్గకల్పక ధ్వజారవిన్దాఙ్కుశ వజ్రలాశ్చిత
హే శ్రీనివాస త్వచ్చరణామ్బుజ ద్వయం మదీయ మూర్ధాన మలజ
ఓం నిరంజనాయ విద్మహే నిరాభాసాయ ధీమహి
తన్నో శ్రీనివాసః ప్రచోదయాత్

శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమః
సువర్ణ దివ్యమంత్రపుష్పం సమర్పయామి.

## ప్రదక్షిణ నమస్కారాః

। యానికానిచ పాపాని జన్మాన్తరకృతానిచ
తాని తాని ప్రణశ్యన్తి ప్రదక్షిణ పదేపదే
పాపో హం పాపకర్మా హం పాపాత్మా పాపసమ్భవః
త్రాహిమాం కృపమయా దేవ । శరణాగతవత్సల ।
అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ
తస్మాత్కారుణ్య భావేన రక్ష రక్ష జనార్ధన ।

శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమః ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. (పై మంత్రాన్ని పఠించుచూ స్వమినే స్మరిస్తూ మూడు సార్లు ప్రదక్షిణాలు చేసి సాష్టాంగ నమస్కారం చేసి పిమ్మట వివిధోపచార పూజను చేయవలెను.)

## వివిధోపచార పూజలు

ఛత్రం ధారయామి, చామరం వీచయామి, నృత్యం దర్శయామి, గీతం శ్రావయామి, వాద్యం ఘోషయామి, ఆందోళికాన్ ఆరోహయామి, అశ్వానా రోహయామి, గజానారోహయామి, సమస్త రాజోపచార, శక్త్యుపచార, మన్త్రోపచార, దేవోపచార, సర్వోపచార పూజాం సమర్ప యామి.

# క్షమార్పణం

మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్ధన
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే
(నమస్కరించవలెను)

అనయాధ్యానా వాహనాది షోడశోపచార పూజయా చ భగవాన్ సర్వాత్మకః శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వరూపో భగవాన్ సుప్రీత స్సుప్రసన్నో, వరదోభవతు. శ్రీ వేంకటేశ్వర దేవప్రసాదం శిరసా గృహ్ణామి.

తీర్థం పుచ్చుకొనుట.

అకాల మృత్యు హరణం సర్వవ్యాధి నివారణం
సర్వ పాపక్షయకరం దేవ పాదోదకం పావనం శుభమ్

(అనుచు స్వామి వారి పాదోదకాన్ని పుచ్చుకోవలెను.)

నైవేద్యం – ఓం భూర్భువస్సువః ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ సత్యంత్వర్తేన పరిషించామి, అమృతమస్తు అమృతో పస్తరణమసి, ఓం ప్రాణాయ స్వాహా..... ఓం అపానాయ స్వాహా, ఓం వ్యానాయ స్వాహా, ఓం ఉదానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా, ఓం బ్రహ్మణేస్వాహా, శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామినే నమః మహా నైవేద్యం సమర్పయామి.

అమృతాపి ధానమసి ఉత్తరా పోశనం సమర్పయామి, హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి, శుద్ధ ఆచమనీయం సమర్పయామి.

తాంబూలం సమర్పయామి, సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి, అనయాధ్యానా వాహనాదిషోడ శోపచార పూజయా భగవాన్ సర్వాత్మకః శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత వేంకటేశ్వర స్వామి సుప్రీతస్సు ప్రసన్నో వరదో భవతు శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత వేంకటేశ్వర స్వామి ప్రసాదం శిరసా గృహ్ణామి.

ఉద్వాసనం – యజ్ఞేనయజ్ఞమయజంత దేవాః తాని ధర్మాణి ప్రథమా న్యాసన్, తేహనాకం మహిమానస్సచంతే యత్రపూర్వే సాధ్యాస్సంతి దేవాః

(శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామి యధాస్థానం ఉద్వాసయామి)

# శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పము

మొదటి అధ్యాయము

## శ్రీ భగవాన్ ఉవాచ:

కలియుగములో ఒకానొక శుభముహూర్తమున సాక్షాత్తూ భూలోక వైకుంఠమే అయిన తిరుమల కొండపై 'విశ్వపతి ' అను భక్తునికి శ్రీనివాసుని రూపములో వెలసి శ్రీ వేంకటేశ్వరునిగా భక్తులచే కొలువబడుతున్న శ్రీమన్నారాయణులవారు 'శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పం' గా ప్రసిద్ధి నొందే ఈ వ్రతం గురించి గ్రంథం రచించవలసిందిగా అనుగ్రహించి, అనుజ్ఞ నిచ్చి ఈ విధంగా చెప్పసాగారు ' ఓయీ, ప్రియ భక్తా! విశ్వపతి నామధేయా, నా ప్రియభక్తుడవయిన నీకు ఇప్పుడు ఒక విశేష వ్రతకల్పము గురించి వివరిస్తున్నాను. ఈ వ్రతము నాకు అత్యంత ప్రియమైనది. అందరునూ ఆచరించుటకు ఎంతో సులభతరమైనది.

కలియుగంలో మానవులు తమ తమ పూర్వ జన్మ ఫలాలను అనుభవిస్తూ, తిరిగి అనేక పాపకర్మలనొనరిస్తూ, అనేక కష్టాలపాలవుతున్నారు. వీరిలో నా భక్తులైన కొందరు వారి వారి కష్టాలను నివారించవలసిందిగా నన్ను వేడుకుంటున్నారు. ఎన్నో వ్యయ ప్రయాసలనోర్చి తిరుమల యాత్రచేసి నన్ను దర్శించుకుంటున్నారు.

నా భక్తులంటే నాకు అత్యంత ప్రియం. నా మీదే పూర్తి భారం వేసి, ధర్మపథంలో జీవితం గడిపే వారి భాధ్యత నేనే వహిస్తాను.

ఇప్పుడు నేను వివరిస్తున్న ఈ వ్రతం 'శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పం' అనే పేరుతో ప్రసిద్ధి పొందగలదు. ఈ వ్రతం నాకు అత్యంత ప్రియమైనది. ఈ వ్రతాన్ని భక్తి శ్రద్ధలతో ఎవరైతే ఆచరిస్తారో వారి బాధలన్నీ తక్షణం నివృత్తి కాగలవు. ఈ వ్రతము ఎవ్వరైనను, ఎప్పుడైననూ ఆచరించవచ్చును. ప్రత్యేకించి మార్గశిర, మాఘ, కార్తీక మాసములందు గానీ, పౌర్ణమి, పంచమి, సప్తమి, ఏకాదశి తిథులయందు గానీ, శ్రవణా, స్వాతి నక్షత్రముల రోజులయందుగానీ ఆచరించిన మిక్కిలి ఫలదాయకము.

ఈ కలియుగములో నా భక్తులైన మీరు అనుభవిస్తున్న కష్టములన్నీ నాకు తెలియును. మీకు ఎప్పుడు ఏ కష్టం కలిగినా, ఏ ఆర్థిక సమస్యలు గానీ, ఆరోగ్య సమస్యలు గానీ,

ఉద్యోగ, వ్యాపార సమస్యలు గానీ కలిగి మనశ్శాంతి లేనప్పుడు ఈ వ్రతము ఆచరించిన ఎడల తక్షణమే ఆ కష్టాలన్నీ తొలగిపోగలవు. మరియు మీరూ మీ ఇంట ఏ శుభకార్యము తలపెట్టిననూ ఈ వ్రతము ఆచరించిన ఎడల ఆ శుభకార్యము నిర్విఘ్నముగా జరిగి వేయిరెట్లు శుభప్రదము కాగలదు. ఈ వ్రత మాచరించిన వెంటనే సకల సుఖ శాంతులు, అష్టైశ్వర్యములు లభించగలవు.

ఉదయమున గానీ, సాయంకాలమందు గానీ ఈ వ్రతము ఆచరించ వచ్చును. ఈ వ్రతము అయిదు అధ్యాయములతో కూడినది. ఈ అయిదు అధ్యాయములనూ భక్తితో పఠించవలెను. మీ స్వగృహమందుగానీ, వసతి గృహమందు గానీ, నా ఆలయములందు గానీ, ఏ పుణ్య క్షేత్రమునందు గానీ నదీ తీరమునగానీ ఈ వ్రతమును ఆచరించవచ్చును.

మీరు వీలైన ఎడల మీ బంధుమిత్రులనందరినీ ఆహ్వానించి ఈ వ్రతమాచరించుట మిక్కిలి శ్రేయోదాయకము. ఈ వ్రతము ఆచరించిన వారికినీ, విన్నవారికినీ, ప్రసాదమును భక్తితో స్వీకరించిన వారికినీ అష్టైశ్వర్యములు కలగగలవు. ఈ వ్రతమును పూర్వకాలములో నా ప్రియభక్తులైన ఎందరో మునీశ్వరులు ఆచరించి ఎన్నో దివ్యాశీస్సులు పొందినారు. భూలోకవాసులైన మీ అందరికీ ఈ వ్రతము మిక్కిలి ఆనంద ప్రదాయనియై అనేక శుభములను కలుగ చేయును. ప్రశాంత మనస్సుతో నన్నే తలచుకుంటూ ఈ వ్రతము ఆచరించినచో వ్రతఫలము మిక్కిలిగా ఉండగలదు.

ఈ వ్రతము ఆచరించు విధానము మిక్కిలి సులభతరము. కలియుగములో మీకు గల కష్టములన్నియూ నాకు తెలియును. అందువలననే అత్యంత కఠోర నిష్ఠతో చేసే తపస్సులకు, యజ్ఞ యాగాదులకు నిచ్చు ఫలము కేవలము ఈ వ్రతము ఆచరించుట వలనే మీరు పొందగలరు.

ముందుగా వ్రతము ఆచరించు ప్రదేశమును చక్కగా శుభ్రపరచు కొనవలెను. మండపమును ఏర్పాటుచేసుకుని నా ప్రియ సఖులైన శ్రీదేవి, భూదేవిలతో కూడియున్న నా పటమును మండపముపై ఉంచవలెను. మండపమును గోడకు ఆన్చి ఉంచవచ్చును. మీకు ప్రియమైన ఇతర దేవతల పటములు కూడా ఉంచుకొనవచ్చును. నవగ్రహదేవతలను, అష్టదిక్పాలకులను ఆవాహన చేసుకొనవలెను. లేదా వారందరికీ మనస్సులోనే నమస్కరించవచ్చును.

ముందుగా పసుపు వినాయకుని పూజింపవలెను. అటు తరువాత ఈ వ్రతమునందలి అయిదు అధ్యాయములను భక్తి శ్రద్ధలతో పఠించవలెను. ఇదియే

ప్రథమాధ్యాయము. మిగిలిన నాలుగు అధ్యాయములను నాకు అత్యంత ప్రీతిపాత్రులైన విశ్వామిత్ర, వశిష్ట, భరద్వాజ, అత్రి మునీశ్వరులు ప్రవచించారు. ఈ అయిదు అధ్యాయములను పఠించిన తరువాత నాకు ప్రియమైన స్తోత్రములను పఠించవచ్చును. ప్రతీ అధ్యాయమునకు చివర గోవిందా, గోవిందా, గోవిందా అని మూడు సార్లు స్మరించవలెను.

ఈ కలియుగములో సామాన్య మానవులైన మీ అందరి కష్టాలూ నాకు తెలియును. కావున మరొక విశేషమును కూడా చెప్తున్నాను. ఈ వ్రతమును ఇంత వివరముగా చేసుకొన శక్తి లేనివారు మీరు ఒక్కరే నా పటమును ఎదురుగా ఉంచుకుని విఘ్నేశ్వరునికి, నవగ్రహదేవతలకు, అష్ట దిక్పాలకులకు మనస్సులోనే నమస్కరించి ఈ అయిదు కథలనూ పఠించి మీకు వీలున్న ఏ ఫలమునైనా నాకు నివేదించి ప్రసాదముగా స్వీకరించవచ్చును. ఈ విధముగా చేసినా కూడా మీ కార్యసిద్ధి కాగలదు. మీ కష్టములన్నీ తొలగిపోగలవు. మీకు సకల శుభములు కలుగును.

ఎవ్వరైతే ఈ వ్రతము అత్యంత భక్తి శ్రద్ధలతో ఆచరిస్తారో వారి గృహమునకు స్వయముగా నేనే ఏదో రూపములో వచ్చి ప్రసాదాన్ని స్వయంగా స్వీకరిస్తాను. నా అనుగ్రహము మీ అందరి యందు ఎల్లప్పుడూ ఉంటుంది. ”

శ్రీ స్వామి వారు తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి ‘విశ్వపతి ’ అను భక్తునికి ఈ విధంగా తనకు అత్యంత ప్రీతికరమై, తానెల్లప్పుడూ నివసించే తిరుమల కొండపై ఈ వ్రత విధానమును అనుగ్రహించారు. కలియుగ వాసులైన మనమందరమూ ఈ వ్రతమునాచరించి శ్రీ వేంకటేశ్వర స్వామివారి అనుగ్రహమునకు పాత్రులు కావలెను. ఈ వ్రతమాచ రించినంతనే మన కష్టములన్నీ తొలగిపోయి, అనేక శుభ ఫలితములు పొందవచ్చును.

గోవిందా ... గోవిందా ... గోవింద ...

ప్రథమోధ్యాయము సమాప్తము

శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్

శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళం

# శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పము

రెండవ అధ్యాయము

# శ్రీ విశ్వామిత్ర ఉవాచ :

ఈ అధ్యాయమును మనకు మహాతపఃసంపన్నులైన సాక్షాత్తూ శ్రీ విశ్వామిత్రులవారు అనుగ్రహించారు. " ఓ కలియుగ వాసులారా! శ్రీనివాసుని ప్రియభక్తులారా ! మీరు ఆచరిస్తున్న ఈ " శ్రీ వేంకటేశ్వర వ్రతకల్పము " అతి పవిత్రమైనది. మహా మహిమాన్వితమైనది. కలియుగములో ఆ శ్రీమన్నారాయణుని కరుణా కటాక్షములు పొందడానికి మిక్కిలి సులభమార్గము. పూర్వకాలమున అనేకమంది శ్రీవారి భక్తులు ఈ వ్రతమాచరించి తమ తమ అభీష్ట సిద్ధి పొందియున్నారు. ఇంత సులభతరమైన వ్రతకల్పము మనకు అనుగ్రహించిన ఆ శ్రీ వేంకటేశ్వర స్వామి వారికి ముందుగా మనమందరము నమస్కరించవలెను.

పూర్వకాలమున మగధ సామ్రాజ్యములో విష్ణుచిత్తుడనే శ్రీవారి ప్రియభక్తుడు ఉండేవాడు. అతనికి తొమ్మిదిమంది స్త్రీ సంతానము కలిగిరి. ఎంతో పాండిత్యము కలిగినను మిక్కిలి పేదరికముతో బాధ పడుచుండెడివాడు. విష్ణుచిత్తుని భార్య తారామతి ఎల్లప్పుడు శ్రీమన్నారాయణునే ప్రార్థిస్తూ ఉండేది.

అప్పుడప్పుడు వివాహాది శుభకార్యాల పౌరోహిత్య కార్యక్రమంలో దక్షిణగా వచ్చెడి కొద్ది సొమ్ముతో ఎంతో కష్టాలు పడుతూ కాపురం సాగిస్తున్నారు ఆ దంపతులు. కుమార్తెలకు యుక్త వయసు సమీపించింది. తారామతికి ఎప్పుడూ వీరి వివాహము ఎట్లు జరిపించవలెనా అని చింతగా ఉండెడిది. ఆ శ్రీనివాసునే ప్రార్థిస్తూ కాలం గడుపుతుండేది.

ఓ శ్రీనివాస భక్తులారా! ఆశ్రిత జనరక్షకుడైన శ్రీ వేంకటేశ్వర స్వామివారికి తన భక్తులన్న అపార ప్రేమయని మనందరికీ తెలిసినదే కదా! ఆనాడు మాఘ పౌర్ణమి. ఉదయాన్నే ఒక వృద్ధ బ్రాహ్మణుడు విష్ణుచిత్తుని ఇంటి తలుపు తట్టాడు. అయ్యా నేను వంగదేశపు వాసిని. ఒక యజ్ఞం నిమిత్తం వెళుతూ దారి మధ్యలో ఈ దేశం వచ్చాను. దయచేసి ఈ ఒక్కరోజు మీ ఇంట్లో ఉండనిచ్చినచో తిరిగి రేపు ఉదయమే వెళ్ళిపోగలను అని విష్ణుచిత్తుని అర్థించాడు. అందులకు విష్ణుచిత్తులు ' స్వామీ ! అంతకు మించిన

అదృష్టము మాకేమున్నది? అతిథి సాక్షాత్తు శ్రీమన్నారాయణునితో సమానమని మన పురాణాలు ఘోషిస్తున్నాయి కదా. తమరు ఎటువంటి సంకోచము లేకుండా మా ఇంటిలో తప్పక ఉండవలసింది. అని ఆ ముసలి బ్రాహ్మణుడిని లోనికి తీసుకువచ్చి సపర్యలు గావించాడు.

ఆ రోజు మధ్యాహ్నం భోజనానంతరము ఆ వృద్ధ బ్రాహ్మణుడు తారామతితో ఇలా అన్నాడు " ఏమమ్మా! దిగాలుగా ఉన్నావు. ఏమిటి నీ బాధ! ఏమీ సంకోచించకుండా చెప్పు " అన్నాడు. అప్పుడు తారామతి "స్వామీ ! తమరు మహా తపస్సంపన్నులు, తేజస్సులో సాక్షాత్తూ ఆ వైకుంఠవాసుని మాదిరిగా ఉన్నారు. మీ వద్ద దాచేదేమున్నది. నా మనోవ్యథంతా నా పుత్రికల వివాహము గురించియే అని విన్నవించుకున్నది. అంతట ఆ విప్రోత్తముడు చిరునవ్వు నవ్వి "తల్లీ ! నీ బాధ నేను గ్రహించితిని. నీ కష్టములన్నీ తొలగిపోయి కుమార్తెలకు శుభప్రదముగా వివాహము కాగలుగుటకు ఒక అద్భుత వ్రతము మీకు చెప్పుదును. ఈ వ్రతము ఆచరించిన మీ కష్టములన్నీ పటాపంచలు కాగలవు. శ్రీ వేంకటేశ్వర వ్రతమను ఈవ్రతము మిక్కిలి సులభతరము. అని చెప్పి ఆ వ్రత విధాన మంతయు ఆ దంపతులకు వివరించాడు.

అంతట విష్ణుచిత్తుడు "స్వామీ! మహా సంతోషం ఇంతకు మించి మహాభాగ్యం ఏముంటుంది? ఎన్నో రోజులు ఎందుకు? శుభశ్యశ్రీఘ్రం అన్నారు గదా మన పెద్దలు.. ఈ రోజు మాఘ పౌర్ణమి. . ఎంతో శుభ దినము, ఈ రోజే తమరు సెలవిచ్చిన శ్రీ వేంకటేశ్వర వ్రతమును ఆచరించెదము అని విష్ణుచిత్తులు, తారామతి దంపతులిద్దరూ తమ కుమార్తెలందరితో కలిసి ఆ రోజు సాయంకాలముననే బంధుమిత్రులను పిలుచుకుని శ్రీ వేంకటేశ్వర వ్రతమును అత్యంత భక్తి శ్రద్ధలతో ఆచరించారు. వచ్చిన భక్తులందరూ వ్రతము పూర్తి అయిన పిమ్మట తీర్థ ప్రసాదములు స్వీకరించి తమ తమ గృహములకు వెడలిరి. అప్పుడు విష్ణుచిత్తులవారు, భార్యా సమేతముగా ఆ బ్రాహ్మణోత్తమునికి పాద నమస్కారము కావించి తమ దంపతులను ఆశీర్వదించవలసిందిగా వేడుకున్నారు. అప్పుడా బ్రాహ్మణోత్తముడు వ్రత తీర్థ ప్రసాదములు తానునూ స్వీకరించి " మనో భీష్ట సిద్ధిరస్తు, శ్రీ లక్ష్మి శ్రీనివాస కటాక్ష సిద్ధిరస్తు " అని ఆశీర్వదించాడు.

ఇంతలో చీకటి పడి నిద్రా సమయమైనది. అంతట విష్ణుచిత్తుడు ఆ బ్రాహ్మణునికి ఒక చిరిగిన దుప్పటిని ఇచ్చి కన్నీళ్ళ పర్యంతముగా ' స్వామీ! కడు పేదనైన నా వద్ద ఇంతకు మించి మంచి దుప్పటి లేదు " ఈ రాత్రికి నన్ను క్షమించి దీనియందే విశ్రమించవలసింది ' అని వేడుకున్నాడు.

అందుకు ఆ బ్రాహ్మణుడు చిరునవ్వు నవ్వి, ఏమి చింతించవలదని చెప్పి తను బయట వసారాలో పడుకుంటానని చెప్పాడు. కొద్ది సేపటికే అందరునూ నిద్రకుపక్రమించారు.

రాత్రి నాలుగోఝామున ఉరుములు, మెరుపులతో పెద్ద వర్షం మొదలైంది. అంతా కటిక చీకటి.. గాఢాంధకారంలో కంటికి ఏమీ కానరావట్లేదు. విష్ణుచిత్తునికి బయట పడుకున్న ఆ ముసలి బ్రాహ్మణుడు ఎలా ఉన్నాడో అని బెంగగా ఉంది. కానీ ఈ గాడాంధకారంలో ఏమి కనిపించక ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా అని ఆ రాత్రి గడిపారు ఆ కుటుంబం అంతా... ఇంతలో తెల్లవారింది.. వాన తేలిక పడింది. బయట బ్రాహ్మణుడు ఏమయినాడో ఎంత బాధ పడ్డాడో అనుకుంటూ బయటకు వచ్చిన ఆ దంపతులకు అద్భుత దృశ్యం కనిపించింది.. అక్కడ విప్రోత్తముడు లేడు !... చిరిగిన దుప్పటి స్థానంలో పట్టు పీతాంబరం ఉంది.... ఆ పీతాబరంపై ' శ్రీ వేంకటేశ్వర స్వామి వారి విగ్రహం చిరునవ్వుతో కన్పించింది... జరిగినదంతా ఆ దంపతులకు అర్థమైంది. వారి ఆనందానికి అవధులు లేవు.. వచ్చింది సాక్షాత్తూ ఆ శ్రీమన్నారాయణుడే ! ... ఆహా ఏమి మన భాగ్యము.. కానీ ఆ స్వామి వారిని గ్రహించలేకపోతిమే ! ... చివరికి చినిగిన దుప్పటి ఇచ్చినామే అని తలుస్తూ శ్రీ స్వామివారి విగ్రహాన్ని కళ్ళకద్దుకుని ఇంట్లోకి వచ్చారు.. ఇల్లంతా స్వర్ణమయంగా కన్పించింది. అంతటా ధనరాశులే!.. ఆహా! శ్రీ వేంకటేశ్వర స్వామి వారి వ్రత కల్ప మహాత్మ్యము వలన గదా ఇదంతయూ జరిగినది అని ఆ స్వామిని అనేక విధాల స్తుతించారు..

చూశారా ! ... సాక్షాత్తూ శ్రీ స్వామివారే ఆ భక్తుని ఇంటికి అతిథి రూపంలో వచ్చి వ్రత విధానము చెప్పడమే కాకుండా తీర్థ ప్రసాదాలు కూడా తానే స్వయంగా స్వీకరించాడు. శ్రీ స్వామి వారు అంతటి కరుణామయుడు. ఎవరైతే భక్తి శ్రద్ధలతో ఈ వ్రతమాచరిస్తారో వారింటికి తానే స్వయంగా ఏదో రూపంలో తప్పక వస్తాడు. మీరందరూ కూడా ఈ వ్రతాన్ని ఆచరించి స్వామి కరుణా కటాక్షాలు పొందండి. " శ్రీ లక్ష్మీ శ్రీనివాస కటాక్ష సిద్ధిరస్తు " అని విశ్వామిత్రులవారు శెలవిచ్చారు.

గోవిందా ... గోవిందా ... గోవింద ...

రెండవ అధ్యాయము సమాప్తము

శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్

శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళం.

# శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పము

## మూడవ అధ్యాయము

# శ్రీ వశిష్ఠ ఉవాచ :

ఈ అధ్యాయాన్ని మహా తపోనిష్ఠా గరిష్ఠులైన శ్రీ వశిష్ఠ మునీశ్వరుల వారు శ్రీమన్నారాయణుల వారి అనుగ్రహంతో మనకు వివరించారు. “ఓ కలియుగ వాసులారా! శ్రీనివాసుని ప్రియ భక్తులారా ! వైకుంఠంలోని శ్రీ మన్నారాయణుడే నేటి తిరుమల శ్రీ వేంకటేశ్వరుడు. కలియుగ వాసులైన మీ అందరి కష్టాలనూ తీర్చడానికి స్వామి మీకు అతి చేరువలో ఈ తిరుమల కొండపై అవతరించారు. ఆ స్వామివారిని ప్రసన్నం చేసుకొనడానికి ఈ వ్రతం మిక్కిలి సులభతరం. ఈ వ్రతం భక్తి శ్రద్ధలతో ఆచరించిన వారు సకల సౌభాగ్యాలనూ అనుభవిస్తారు.

పూర్వకాలంలో అవంతీ దేశంలో భాగ్యనగరమనే పట్టణం ఉండేది. పేరుకు తగినట్లుగానే ఆ పట్టణంలో అనేక మంది భాగ్యవంతులు ఉండేవారు. అయితే వారు తమ తమ సంపదలను చూసుకుని గర్విస్తూ మిగిలిన సామాన్యులను అతి హీనంగా చూసేవారు. ఆ ఐశ్వర్యమంతా తమ గొప్పేనని తలుస్తూ నిత్య పూజలు కాదు గదా, విశేష రోజులలో కూడా ఏ పూజలూ చేసేవారు కాదు. ఆ సృష్టికర్త శ్రీమన్నారాయణునికి వీరందరికీ జ్ఞానోదయం కలిగించాలని తోచింది.

ఒకరోజున ఆ ధనవంతులందరూ అనేక విందు విలాసాలలో మునిగి తేలుతున్నారు. ఆ పట్టణ తూర్పువీధిలో గల శ్రీ లక్ష్మీనారాయణ ఆలయంలో కనీసం దీపం వెలిగించే నాథుడు కూడా కరువయ్యాడు. ఆ రోజు తొలి ఏకాదశి అత్యంత పర్వదినం. కానీ ఆ పట్టణంలో ఒక్కరు కూడా ఆ ఆలయానికి పూజాదికాలు నిర్వర్తించాలని ఆలోచించట్లేదు. సాయంత్రం ఉన్నట్టుండి దట్టమైన మబ్బులు కమ్ముకున్నాయి. బ్రహ్మాండమైన కుంభవృష్టి. వ్యాపారులందరి ఇళ్ళూ నీట మునిగి పోసాగాయి. అంతా గాడాంధకారం. తెల్లవారే సరికి ఊరంతా నేలమట్టమయింది. వ్యాపారుల ఇళ్ళన్నీ కూలిపోయాయి. అన్నీ ఐశ్వర్యాలూ పోయి చివరికి కట్టుబట్టలతో మిగిలారు. ఎందుకీ ఉపద్రవం... ఎందుకీ

జల ప్రళయం... ఎవరికీ అంతు బట్టట్లేదు... అంతలో వారికొక విశేషం కనిపించింది.... ఊరి చివరన ఉండే పూరిపాకలు చెక్కు చెదరకుండా ఉన్నాయి.. వారికి ఆశ్చర్యం కలిగింది.. ఇంత కుంభవృష్టిలోనూ ఈ పూరిపాకలు ఎలా ఉన్నాయి?.... అని వారిలో వారు అనుకుంటుండగా ఇంతలో ఒక పెద్ద మెరుపు మెరిసింది.. ఆకాశవాణి ఇలా పలికింది.

' ఓ మూర్ఖులారా ! మీ సంపదలన్నీ మీ గొప్ప తనమని తలచుకొనటం వలననే ఇలా జరిగింది.. ఆ పూరి గుడిసెలో నివసించే దేవయ్య నాకు ప్రియభక్తుడు. అతి సామాన్యుడైన దేవయ్య ప్రతిరోజూ మీ ఊరిలోని శ్రీ లక్ష్మీనారాయణ ఆలయంలో దీపం వెలిగిస్తున్నాడు... అంతే కాక ప్రతీ ఏకాదశినాడు తనకు వీలున్నంతలో శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పాన్నీ నిర్వర్తిస్తున్నాడు. ఆ వ్రత ఫలితంగానే తనతో పాటే ఆ గుడిసెలలోని వారందరూ రక్షింపబడ్డారు. మీరందరూ కూడా ఆ వ్రతం ఆచరించిన ఎడల మీ మీ ఐశ్వర్యాలను తిరిగి పొందగలరు.' అని వినిపించింది. వెంటనే వారందరూ ఆ ఆలయానికి వెళ్ళి తక్షణమే అందరూ తలొక పనికీ పూనుకుని శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పాన్ని ఆచరించారు. ఆ వ్రత ఫలితంగా అందరి గృహాలూ పూర్వరూపంలో కనిపించాయి. అది మొదలుగా ఆ వర్తకులందరూ శ్రీవారి భక్తులై ప్రతీ ఏకాదశి నాడూ శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పాన్ని ఆచరిస్తూ బ్రతికినంత కాలం సుఖసౌభాగ్యాలతో ఉండి చివరికి ముక్తిని పొందారు. " అని శ్రీ వశిష్ఠులవారు వివరించారు.

గోవిందా ... గోవిందా ... గోవింద ...

మూడవ అధ్యాయము సమాప్తము

శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్

శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళం.

# శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పము

నాలుగవ అధ్యాయము

# శ్రీ భరద్వాజ ఉవాచ :

శ్రీమన్నారాయణునికి అత్యంత ప్రీతికరమైనటువంటి ఈ 'శ్రీ వేంకటేశ్వర వ్రతకల్పము ' లోని నాలుగవ అధ్యాయమును మహా మునీశ్వరులు శ్రీ భరద్వాజ మహర్షుల వారు ఈ విధంగా చెపుతున్నారు. "ఓ కలియుగ వాసులారా ! శ్రీమన్నారాయణ ప్రియభక్తులారా! మీరు ఆచరిస్తున్నటువంటి శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పము అద్భుతమైనది. మీ కోరికలన్నింటినీ తక్షణమే తీర్చగల ఉపాయము. శ్రీ వేంకటేశ్వరుని ప్రసన్నుని గావించుకొనడానికి అత్యంత సులభతరమార్గము ఇదియే. మీ అందరినీ అనుగ్రహించడానికి సాక్షాత్తూ ఆ వైకుంఠవాసుడే కలియుగంలో తిరుమల కొండపై శ్రీనివాసునిగా వెలిసాడు. ఎన్నో జన్మల పుణ్యఫలం చేతగానీ తిరుమల కొండపై కాలిడడం సాధ్యం కాదు. స్వామి దర్శనము సాధ్యము కాదు. ఇదే విధముగా ఈ 'శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పము ' ఆచరించే సంకల్పము కలుగుట కూడా ఎంతో పూర్వ జన్మ పుణ్యఫలము వలనే కానీ సాధ్యము గాదు. ఆచరిస్తున్నవారూ, కథలు విన్నవారూ, ప్రసాదము స్వీకరించిన వారూ శ్రీవారి కృపకు పాత్రులై ఎంతో మహాభాగ్యము పొందుదురు.

పూర్వకాలమున 'నగరి' అనే గ్రామములో ధనగుప్తుడనే వ్యాపారుడు ఉండేవాడు. అతడు మహా లోభి. ఎంత ఐశ్వర్యములు సంపాదించిననూ అతని లోభితనమునకు అంతు లేకుండెను. ఈ ఐశ్వర్యమంతయూ తన గొప్పయే యనుకుని విర్రవీగెడివాడు, ఎంతటి వారనయినను ఈ అహంకారమే గదా అథో పాతాళమునకు త్రోసివేయునది.

ధనగుప్తుని భార్య కాంతిమతి మాత్రము ఎంతో భక్తి శ్రద్ధలు కలగి యుండెను. వారికి ముగ్గురు పుత్రికలు. చివరి పుత్రికైన 'కుమారి' కి దైవభక్తి ఎక్కువగా నుండెడిది. ఎల్లప్పుడూ ఆ శ్రీనివాసునే తలుస్తూ ఉండేది.

తండ్రికి తెలియకుండా వీలున్నప్పుడల్లా శ్రీ వేంకటేశ్వర స్వామి వారి ఆలయానికి వెళ్ళి స్వామిని దర్శించుకుని వస్తుండేది. ఇంటికి తీసుకువచ్చిన ప్రసాదాన్ని అందరూ స్వీకరించినా తండ్రి మాత్రం ఎప్పుడూ తీసుకునేవాడు కాడు. భర్త యొక్క ఈ ప్రవర్తనకు కాంతిమతి మిక్కిలి చింతించెడిది.

ఒకరోజు 'కుమారి' తన స్నేహితుల ఇంట 'శ్రీ వేంకటేశ్వర వ్రతము' జరుగుతున్నదని తెలుసుకుని తాను కూడా వ్రతకథలను వినుదామని వెళ్ళింది. వ్రతము పూర్తి అయ్యేసరికి మిట్ట మధ్యాహ్నం అయింది. ప్రసాదము తాను స్వీకరించి కొంచెము పొట్లముగా కట్టించుకుని ఇంటికి బయలు దేరినది. మార్గమధ్యమునకు వచ్చేసరికి ఎండ తీవ్రత ఎక్కువయినది. ఎక్కడైనా కొంచెం దాహం తీర్చుకుందామని తలచగానే ఆ పక్కవీధిలోనే తన తండ్రి అంగడి ఉందని గుర్తొచ్చింది., ఆ అంగడికి వెళ్ళి ఈ వ్రతము గురించి తండ్రికి చెప్పకుండా నీళ్ళు అడిగి తాగింది. తండ్రి కోపగించు కుంటాడనే భయంతో కంగారుగా దాహం తీర్చుకుని వడివడిగా ఇంటి దారి పట్టింది. ఈ హడావిడిలో కుమారి ప్రసాదం పొట్లం దుకాణంలోనే మర్చిపోయి వదిలివేసింది.

ఇంతలో ఆ బజారులో ఒక్కసారిగా అలజడి మొదలైంది. ప్రజలందరూ హాహాకారాలు పెడుతూ పరుగెడుతున్నారు? పెద్ద అగ్ని ప్రమాదం సంభవించి ఆ వీధిలోని అంగళ్ళు అగ్ని దేవుని ప్రతాపానికి ఆహుతి కాసాగాయి. అసలే మిట్ట మధ్యాహ్నం... దానికి తోడు తీవ్రమైన వడగాలి.... ధన గుప్తుడి శరీరం భయంతో కంపించింది.. ఇంకొద్ది క్షణాలలో తన కళ్ళ ఎదుటే తన అంగడి కూడా బూడిద కావలసిందే.... ఈ ఆలోచనతో చేతులు వణికి పోతున్నాయి... అంగటి నుంచి అందరూ బయటకు పరుగులు తీశారు. కాని తాను ఉండిపోయాడు.. విడిచి పోబుద్ధి కావట్లేదు.. ఉంటే తాను మసైపోగలడు... ఈ కంగారులో చేతికి ఏదో పొట్లం తగిలింది.. ఏ ఆలోచనా లేకుండా తీసి నోట్లో వేసుకున్నాడు.. తియ్యగా అనిపించింది.. అంతే కాదు, మనస్సు కొంచెం స్థిమిత పడ్డట్టు కూడా తోచింది...

అప్పుడే ఒక అద్భుత సంఘటన జరిగింది.. మంటలన్నీ ధనగుప్తుడి ముందు దుకాణం వద్దే ఆగిపోయాయి.. ఒక్క నిప్పు రవ్వ కూడా తన దుకాణం పై పడలేదు.. ఏమీ ఈ విచిత్రం.. ఏమి ఈ మాయ... ధన గుప్తుడి నోటి మాట రాలేదు.. ఇంతలో ఈ వీధిలో అగ్ని ప్రమాదం జరిగిందని ఇంటిలో తెలిసి భార్య కాంతిమతి, కుమార్తెలతో సహా భయాందోళనలతో ఆ శ్రీనివాసునే ప్రార్థిస్తూ అక్కడికి వచ్చారు.. అంగడివరకూ వచ్చిన మంటలు పక్కనే ఉన్న అంగడి వద్దే ఆగిపోవడం చూసి సంభ్రమాశ్చర్యలకు లోనయ్యారు. అప్పుడు కుమార్తెకు తాను అంగడిలో మరిచిన పొట్లం గుర్తుకు వచ్చింది.. ధనగుప్తుడు అంతకుముందు తాను తిన్నది ఆ పొట్లంలోనే పదార్థంగా గ్రహించాడు. కుమారి ఆ పొట్లం శ్రీ వేంకటేశ్వర స్వామివారి ప్రసాదం అనీ, తాను వ్రతంలో పాల్గొనటం అంతా వివరించింది.. తాను స్వీకరించిన ఆ ప్రసాద మహత్యం వల్లనే తానా ప్రమాదం నుంచి బయట పడినట్లు ధన గుప్తుడు గ్రహించాడు.

శ్రీవారిని క్షమించమని చెంపలు వేసుకున్నాడు, సాయంకాలమే ఊరివారందరినీ పిలిచి ‘ శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పము ’ భక్తి శ్రద్ధలతో ఆచరించాడు. అప్పటి నుంచీ ఆ వర్తకుడు పూర్తిగా స్వామివారి సేవలకే శేష జీవితాన్నంతా గడిపి చివరికి ముక్తిని పొందాడు.

కేవలం ప్రసాదాన్ని స్వీకరించినంతనే ఎంత ఆపదనుంచి బయట పడ్డాడో చూశారు గదా... ఈ వేంకటేశ్వర వ్రత మాహాత్మ్యము అంతటి అద్భుతమైనది.. మీరందరూ వీలున్నప్పుడల్లా ఈ వ్రతమాచరించి శ్రీనివాసుని కృపకు పాత్రులు కావలిసింది” అని భరద్వాజులవారు అనుగ్రహించారు.

గోవిందా ... గోవిందా ... గోవింద ...

నాల్గవ అధ్యాయము సమాప్తము

శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్

శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళం.

# శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పము

## అయిదవ అధ్యాయము

# శ్రీ అత్రి ఉవాచ :

భూలోక వైకుంఠమే తిరుమల తిరుపతి. తిరుమలతో సమానమైన పవిత్ర ప్రదేశం గానీ, శ్రీ వేంకటేశ్వరునితో సమానమైన దైవం గానీ ఇంతకు ముందు లేదనీ, ఇక ముందు ఉండబోదనీ పురాణాలు ఘోషిస్తున్నాయి. శ్రీనివాసునిగా వెలసిన శ్రీమన్నారాయణునికి తన భక్తులంటె అలవిమాలిన ప్రేమ. ఎవరైతే తనమీదే పూర్తి భారం వేసి, నిత్యం తననే స్మరిస్తూ, సత్ప్రవర్తన కలిగి జీవిస్తారో వారి యోగక్షేమాలు తానే వహిస్తాడు. అంతటి దివ్య దేవుని ప్రసన్నం చేసుకొనటానికి అత్యంత సులభతరమైన మార్గం ఈ శ్రీ వేంకటేశ్వర వ్రతకల్పము.

ఈ అద్భుత వ్రతకల్పంలోని అయిదవ అధ్యాయాన్ని మహా తపఃసంపన్నులైన శ్రీ అత్రి మహర్షులవారు ఇలా అనుగ్రహించారు "నాయనలారా! శ్రీనివాసుని ప్రియభక్తులారా! కలియుగవాసులైన మీ అదృష్టం చెప్పనలవి కానిది. కృత, త్రేతా, ద్వాపర యుగాలలో ఎంతో కఠోర నియమ నిష్ఠలతో ఆరాధిస్తే గానీ ప్రసన్నం కాని శ్రీమన్నారాయణుడు కలియుగంలో కేవలం నామ స్మరణంతోనే మిమ్మల్ని అనుగ్రహిస్తున్నాడు. ఆర్తితో పిలచిన వారి చెంత తక్షణం ఉంటాడు. అంతటి కరుణామూర్తి శ్రీనివాసుడు. తిరుమల క్షేత్రమంతా సాలగ్రామమయమే! ఆ పవిత్ర కొండపై మీరు వేసే ప్రతి అడుగూ ఎన్నో జన్మల పుణ్యఫలం.

పూర్వకాలంలో కౌమార దేశంలో 'మిత్రుడు' అనే చాకలి ఉండేవాడు. అతడు తన కులవృత్తిని నిర్వర్తిస్తూ వీలున్నంతలో దాన ధర్మాలు గావిస్తూ ధర్మపరంగా జీవిస్తుండేవాడు. కాని అతడి దిగులంతా అతనికున్న అవిటి తనమే. కాలు అవిటిది కావడం చేత ఉతికిన బట్టలను మూటలు కట్టి ఇంటింటికీ తిరిగి ఇవ్వటం చాలా కష్టంగా ఉండేది. దానికి తోడు గంపెడు సంసారం. కష్టపడకపోతే పూట గడవదు. ఎల్లప్పుడూ ఆ శ్రీనివాసునే ప్రార్థిస్తూ ఉండేవాడు. ఏదో ఒక రోజున ఆ స్వామి తనను కరుణిస్తాడన్న నమ్మకంతో జీవనం సాగిస్తున్నాడు. భక్తజన సులభుడైన శ్రీమన్నారాయణుడు ఇదంతా

గమనిస్తూనే ఉన్నారు. ఎవ్వరికైనా వారి పూర్వజన్మ కర్మ నివృత్తి అయ్యే సమయానికి శ్రీనివాసుడే ఏదో రూపంలో వచ్చి తన భక్తులను తప్పక ఆదుకుంటాడు.

ఒక రోజు సాయంకాలము నాడు రోజులాగే మిత్రుడు చాకిరేవు నుండి బట్టల మూటతో పట్టణానికి రోజుతూ, రొప్పుతూ తిరిగి వస్తున్నాడు. ఇంతలో మార్గమధ్యంలో వాడికి ఒక ముసలి బ్రాహ్మణుడు తారసిల్లాడు. సహజంగా భక్తి శ్రద్ధలు కలవాడు అవడం చేత మిత్రుడు భుజంమీద మూటలు క్రింద పెట్టి ఆ బ్రాహ్మణునికి నమస్కరించాడు. అంతట ఆ విప్రోత్తముడు 'నాయనా' ఈ అవిటి కాలితో ఎంతో బాధపడుతున్నావు. నీ బాధ చూడటానికే కష్టంగా ఉంది.. నువ్వెంత కష్టపడుతున్నావో కదా! ' అని అన్నాడు. అప్పుడు మిత్రుడు స్వామీ ! మీరెవరో మహానుభావులు లాగా ఉన్నారు. గంపెడు సంసార భారం చేత నాకీపని తప్పటంలేదు. ఈ అవిటి తనం పోయే మార్గం ఏదైన శెలవియ్యవలసింది ' అని విన్నవించుకున్నాడు.

అప్పుడు ఆ ముసలి బ్రాహ్మణుడు 'నాయనా ! తప్పక చెపుతాను. సావధానంగా విను. నీ అవిటి తనం పోవడమే కాకుండా నీకు అష్టైశ్వర్యాలు కలిగే వ్రతం ఒకటి చెపుతాను. వ్రతం ఆచరించిన మరుక్షణమే నీకు వెయ్యి వరహాలు లభిస్తాయి... అయితే ఒక షరతు.. అందులో సగం నాకు సమర్పించాలి... రేపు మళ్ళీ ఇదే సమయానికి ఇక్కడికి వస్తాను ' అని చెప్పాడు.

అప్పుడు మిత్రుడు 'స్వామీ! ఇంతకు మించిన మహాభాగ్యం ఏముంటుంది! ఆ వ్రతమేదో ఈ రోజే ఆచరిస్తాను' శెలవియ్యండి! అని ప్రార్థించగా ఆ బ్రాహ్మణుడు 'శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పాన్ని ' వివరంగా చెప్పాడు.

మిత్రుడు రెట్టించిన ఉత్సాహంతో ఇంటికివచ్చి ఈ విషయమంతా భార్యకు చెప్పి ఇరుగు పొరుగులవారిని ఆహ్వానించి శ్రీ వేంకటేశ్వర వ్రతాన్ని ఆచరించి తీర్థ ప్రసాదాలు తాను స్వీకరించి వచ్చిన వారందరికీ పంచాడు.... ఇంతలో ఇంటి బయట ఏదో కోలాహలం వినపడింది.. మిత్రుడి కుమారుడు బయట నుంచి ఇంట్లోకి పరుగు పరుగున వచ్చి 'అయ్యా! రాజభటులు నీ కోసం వచ్చారు. రాజుగారు నీకు కట్న కానుకలు పంపిచారట' అన్నాడు. ఇంతలో రాజభటులు వచ్చి మిత్రుడిని రాజుగారి ఆస్థానంలో చాకలిగా నియమించారనీ వెయ్యి వరహాలు బహుమానంగా పంపారని చెప్పి మిత్రుడి చేతిలో వేయి వరహాల మూట పెట్టారు. ఒక వారంలోపల వచ్చి రాజుగారి కొలువులో చేరవలసిందని చెప్పారు.. మిత్రుడి ఆనందానికి అవధులు లేవు.. వారం దాకా ఎందుకు, రేపే వెళ్ళాలి అని మూట, ముల్లె సర్దుకుని మరుసటి రోజు తెల్లవారుఝామునే

ప్రయాణమయ్యాడు. ఈ ఆనందంలో ఆ ముసలి బ్రాహ్మడి సంగతే మరిచిపోయాడు.. దారిమధ్యలో గుర్తుకు రాగా, ఒక నెల తర్వాత కలవ వచ్చులెమ్మనుకున్నాడు.. వెళ్ళి రాజాస్థానంలో చేరాడు.. రోజులు, నెలలు గడుస్తున్నాయి.. ఆ బ్రాహ్మడికిచ్చిన మాట పూర్తిగా మరిచిపోయాడు.. అంతే బ్రాహ్మణరూపంలో వచ్చిన ఆ స్వామివారికి కోపం వచ్చింది... మానవ నైజం అంతేనని అనుకున్నారు శ్రీ స్వామివారు.. తన మాహాత్మ్యం తెలియ చెప్పాలని నిర్ణయించుకున్నాడు.

అంతే ఆ మర్నాడే రాజాస్థానంలోని రాణిగారి నగలు మాయ మయ్యాయి...... ఆ అభాండం మిత్రుడి మీద పడింది...

మిత్రుడికి కఠిన కారాగార శిక్ష పడింది... రాజభటులు మిత్రుడిని పలు విధాల శిక్షించారు.. ఎందుకిలా జరిగింది... ఎందుకీ అభాండం తనమీద పడింది అని తలుస్తున్న మిత్రుడికి ఆ రాత్రి స్వామివారు కలలో కనపడి వృద్ధ బ్రాహ్మడి రూపంలో వచ్చినది తానేనని, తనకిచ్చిన మాట నిలబెట్టుకోక పోవడం చేతనే ఇలా జరిగిందని చెప్పారు.. అప్పుడు మిత్రుడు "స్వామీ! నేను మిక్కిలి పాపాత్ముడిని'... ఎంతటి అపరాధం చేశాను.. దయచేసి నన్ను కరుణించండి... ఇక మీదట తప్పక ప్రతీనెలా మీ వ్రతం ఆచరిస్తాను.. నా సంపాదనలో సగభాగం ప్రతీనెలా జీవితాంతం తమకే సమర్పిస్తాను ' అని చెంపలు వేసుకుని స్వామివారిని పరి పరివిధాల వేడుకున్నాడు. భక్తజన సులభుడైన స్వామివారు అందుకు సంతోషించి మిత్రుడిని అనుగ్రహించారు. శ్రీవారి అనుగ్రహం చేత రాణి నగలు వేరే ప్రదేశంలో మరుదినమునే దొరికినవి. మిత్రుడు దొంగలించలేదని రాజు గ్రహించడం జరిగింది... మిత్రుడిని కారాగారం నుంచి వదిలివేశారు.... అప్పటి నుంచీ మిత్రుడు స్వామివారికిచ్చిన మాట ప్రకారం ప్రతీనెలా ' శ్రీ వేంకటేశ్వర వ్రతం ' ఆచరిస్తూ తన సంపాదనలో సగభాగం స్వామి వారికే సమర్పిస్తూ కలకాలం సుఖంగా జీవించి చివరన ముక్తిని పొందాడు." అని అత్రిమహర్షుల వారు శెలవిచ్చారు.

గోవిందా ... గోవిందా ... గోవింద ...
పంచమోధ్యాయము సమాప్తము

శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్
శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళం.

శ్రీ వేంకటేశ్వర వ్రత కల్పము సమాప్తము

